# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కల్పితము

సంపుటము 23 డిసంబర్ 1980 సంచికలు 12

చిత్రములు : — 1. "అపరిమిత అనుగ్రహం"
2. ప్రేమప్రవాహము



☞ చందాదారులు గమనించండి!

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు "....1/--31" అనియుండిన, మీ చందా జనవరి నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు 8రూ ॥) డిసంబర్ నెల 31వ తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

—: శ్రీ వారి కార్యక్రమములు : —

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిపికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్, ప్రశాంతినిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 8 రూ ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలయును.
వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

**23**

గౌడీయోపాసన—అవ్యక్త పురుషోత్తమ రూపములో కృష్ణపరమాత్మను, వ్యక్త పరాశక్తి ప్రకృతి రూపములో రాధను అనుదర్శనము చేస్తూ ఈ కలిలో రాధామాధవ నామసంకీర్తన చేస్తూవుంటే పొందే ఆనందమే కేవలము మోక్షము అంటారు గౌడపాదాచార్యులు. ఆయన సనాతన గోస్వామి. ఆ పరమాత్మ ఆనందరస స్వరూపుడు. ఆ రసాన్ని పొందితేనే ప్రాణికి నిజమైన ఆనందం కలుగుతుంది అనే శ్రుతి వచనానుసారం—ఆ రసానంద నిధిని అనుభవించాలంటే శ్రీరాధామాధవ నామమే శరణ్యం అంటారు.

నింబార్కాచార్యులు—ద్వైతోపాసనలో పురుష ప్రకృతి సంబంధంవలెనే, జీవాత్మ పరమాత్మ సంబంధంగా భావించి ఉపాసించాలంటారు వల్లభాచార్యులు. శుద్ధాద్వైతోపాసనలో 'కృష్ణస్తు భగవాన్ స్వయం"—కృష్ణభగవానుడు స్వయంగా పరమాత్మ. ఆ సర్వాత్మను పొందటమే శుద్ధాద్వైత మోక్షము.

శైవోపాసన—"అంగం సర్వకాలం" పృథ్వ్యాధి తత్త్వాల స్థితిగతులకు మూలకారణమైన లింగము. అదే పరమశివస్వరూపం. ఆ యిష్ట లింగప్రాప్తినే మోక్షము అని అంటారు.

శివాద్వైతోపాసన—జీవాత్మ తనను కర్తగాను, భోక్తగాను భావించుకొని ప్రకృతి బద్ధుడు అవుతున్నాడు. శివప్రాప్తి కలిగితేనే జీవునకు మోక్షము కలుగుతుంది, అంటే, శివైక్యత కలుగుతుంది అంటారు. వీరశైవోపాసన — (జంగములు)— వక ఈశ్వరుడుతప్ప వేరు యేమీ లేదంటారు.

ఈశ్వర విభూతిని (శక్తి) పొందటమే ముక్తి అంటారు.

పాశుపతోపాసన—జీవుడు ప్రకృతి గుణాలనే పాశాలతో కట్టివేయబడిన పశువు. ఆ పశువుకూ, ఆ పాశాలకూ, ఆ ప్రకృతికీ నియంత పరమేశ్వరుడు అందుకే పశుపతిని పొందటమే ముక్తి అంటారు. శాక్తోపాసన—"సర్వదేవమయీదేవీ" ఆదిపరాశక్తి సర్వదేవమయి. ఈ వివిధ విచిత్ర రూపములకు నామములకు కారణమైన ప్రకృతియే మాయా శక్తి. ఈశక్తి కలిగినవాడే మహేశ్వరుడు. ఈ జంట అవయువాలతో ఈ నింగి నేల నిండిఉన్నై. అవ్యక్తంగా పురుషరూపంలో వున్న పరమేశ్వర తత్వమే వ్యక్తంగా స్త్రీ రూపములో మాయగా వున్న పరాశక్తి. ఆమే జగన్మాత. అమ్మల గన్నయమ్మ. ఆ పరాశక్తి మనలో స్వభావికమై తెలిసినా బలముగా, క్రియగా అనుభవమౌతుంది.

జైనోపాసన—జైనులు (మార్వాడీలు) వైష్ణవ ప్రాధాన్యంగా వుంటుంది. శంఖచక్ర ధారుడైన విష్ణుభగవానుని ప్రతిమలు దేవాలయములలో పూజిస్తారు.

ణమో అరి హరితాణమ్ ణమో సిద్ధాణమ్!
ణమో అయిరియాణమ్ణమోఉవఝ్ఝాయాణమ్!
ణమో లోప సబ్బ సాహూణమ్.
ఇవే జైనుల మంత్రాలు.

కామాది వైరులను జయించే మహావీరులకు, సిద్ధులకు, ఆచార్యులకు, ఉపాధ్యాయులకు, లోకములో వున్న సర్వసాధువులకూ నమస్కారములు. ఈ పంచనమస్కారములూ పాప పరిహారం చేస్తాయి. ఈమంత్రధారణే సర్వశుభం.

ఈమంత్ర భావంలోనే ముక్తి పొందాలంటారు జైనులు.

సిక్కులు—సాంప్రదాయోపాసన ఆ దేశాన్ని చేసే గురువునూ, ఆయన ఉపదేశాల సమ్మేళనమయిన "గ్రంథసాహెబు"నూ పూజిస్తూ కీర్తిస్తూ ఉండటమే పరమధర్మం. భారతీయ సంప్రదాయములో సిక్కుసంప్రదాయము అంతర్భావం.

క్రైస్తవోపాసన—ఏసుప్రభువే రక్షకుడు. తెలిసియో, తెలియకనో పాపాలుచేయటం మనిషికి పరిపాటి. మానవుల పాపాలను తొలగించి పరిశుద్ధులను చేయడానికే ఏసుప్రభువు శిలువపై రక్తాన్ని చిందించాడు. ఆ ప్రభువునూ, ఆయన ఉపదేశాలనూ, "బైబులు" అనే మతగ్రంథములోని సూత్రాలనుఆచరిస్తూ ఉపాసిస్తూ ఉండటమే మనిషికి మంచి దారి. క్రైస్తవోపాసనలో స్తోత్రము చేయటమే ముఖ్యంగా ఉపాసనా నియమం.

మహమ్మదీయోపాసన— ఈమాన్‌దారీ ఖైదామే తో—పైగంబర్ మే భరోసా. ఆత్మవిశ్వాసం కలిగి ఉండటం దైవముపై సర్వభారము పెట్టి యుండటం, దైవశక్తి అడుగడుగునా గుర్తించుచూ ఉంటం-ఇవి లోకములో ప్రధాన నియమాలు. దేహత్యాగం చేసిన తరువాత పరలోకంలో దేవుని దర్బారులో తన వాస్తవికతను నిరూపించుకొనటం అంటే—అందుకు తగిన రుజువర్తన జీవితాంతం వరకూ కలిగియుండటం. దైవవాణియైన ఖురాను గ్రంథబోధనలను అక్షరాలా ఆచరించటం. ఇవి మహమ్మదీయోపాసనలో పారలౌకిక నియమావళి.

'అల్లా హెూ అక్బర్" "లా యిలాహ" "ఇల్లలాహ' మహమ్మదీయుల ప్రధాన

మంత్రాలు. (భగవంతుడు సర్వోత్తముడు. అంతకంటే మించిన విశ్వనియంతలేడు. అతడే ఆరాధించ తగినవాడు అని ఈ మంత్రముయొక్క అర్థము).

నాకంటే మించినది లేదు. "నా పరమస్తికం నాక" అనే భగవద్గీతార్థము. మహమ్మదీయ మంత్రార్థానికి సామ్యాలే. అందువలన మహమ్మదీయ సాంప్రదాయముకూడా భారతీయ హైందవ సాంప్రదాయములో అవాంతర భాగమే.

ఈవిధంగా మానవుడు ఆత్మ పరిశోధనకు ప్రారంభించినప్పటినుండీ తరతరాల నరజాతికి తారకమైన అనంత విజ్ఞాననిధిగా ఎరింగిన భారతీయుల సంస్కృతి అనంతగంభీరం కావటంవల్ల, భిన్నభిన్న సాంప్రదాయాల రూపాలలో నదులెన్ని వచ్చిననూ, చేరిననూ పొంగక, కృంగక ధర్మసీమలో నిలచియున్నది.

అంతేకాక విశ్వాత్మకమై, సార్వభౌతికమై, సర్వకారుకమై, పెంజీకటికవ్వల నేకాకృతియై వెలిగే విజ్ఞాన విజయ జ్యోతియై వెలుగుచున్నది. ఇట్టి పవిత్రమహా సంస్కృతిక క్షేత్రమైన భారత ధాత్రి మీద మనిషిగా పుట్టుటకంటే సుకృతములేదని తెలిసుకోగలిగిన, మనిషికికలిగే ఆనందం అపారం.

(సశేషం)

## నా స్వామి

నాస్వామి పాదాలు నాకమలు విందేను
నాస్వామి రూపుతో నామనసెంతొ పొంగేను
నాలోని అణువణువు నాస్వామి ఆలయము
నాలోని ప్రతితలపు నాస్వామి మయము.

నాత్రితుకు నాబాట నాస్వామి దిద్దేను
నాస్వామి దయవలనె నను నేను తెలిశాను.
నాస్వామినే నేనంతటా చూచేను
నాస్వామిలో నేనంతనూ చూచేను.

ఎన్నెన్ని జన్మల పుణ్యమోమరి
ఈ జన్మలో స్వామి పరిచయము కలిగేను
ఈ పరిచయమె నేడు పరమార్థమయ్యేను
నాజీవనమె ఇక ప్రణవమున విలిచేను.

ఎం. కృష్ణస్వామి M. A.

# దేశదేశాల్లో భగవాన్ సాయి

ఆమధ్య భారతదేశం వచ్చినపుడు బల్గేరియా దేశపు సాంస్కృతిక వ్యవహారాల మంత్రిణి ఆహ్వానానుసారం పోయిన జూన్ ఒకటవ తారీఖునాడు ఆ దేశం చేరుకున్నాను. ఆ మంత్రిణి నన్ను బల్గేరియాలో యోగాభ్యాసం మీద కొన్ని తరగతులు అధ్యాపకులకోసం నడపమని కోరింది. ఆ సందర్భంలో ఆమెకు స్వామి గురించి చెబుతూ "సాయిబాబా—సాయి యోగా" అనే నా పుస్తకాన్ని బహూకరించాను. తదుపరి బాబావారి 50వ జన్మదినోత్సవానికి సంబంధించిన చలనచిత్రం కూడా చూపాను. ఇవన్నీ ఆమె ప్రశాంతినిలయం దర్శించడానికి తోడ్పడ్డాయి. స్వామి ఆమెపై చాలా మంచి ప్రభావం చూపారు.

సోఫియాలో నేను గడపిన కాలం మరచిపోలేనిది. విశ్వవిద్యాలయాల్లోని ఆచార్యులూ, వైద్యులూ, ఇంజనీర్లూ, కళాకారులూ తదితరులూ దాదాపు నూటయాభై మందికి పైగా యోగాభ్యాస తరగతులకు అత్యంత ఉత్సాహంతో హాజరయ్యారు. మూడు ఆసుపత్రుల్లో ప్రత్యేకంగా యోగాభ్యాస తరగతులను నడపవలసి వచ్చింది. ఆసుపత్రుల్లో డాక్టర్లూ, నర్సులూ పాల్గొని రకరకాల అస్వస్థతలనుంచి స్వాస్థ్యం పొందడానికవసరమైన ప్రత్యేక ఆసనాలను ప్రాణాయామ అభ్యాసములనూ నేర్చుకొన్నారు. నేను నా యోగాభ్యాసాన్ని "సాయియోగం" అని ఎందుకు పిలువవలసి వచ్చిందో వివరించవలసి వచ్చినపుడు వారందరికీ శ్రీ బాబావారి గురించి చెప్పాల్సి వస్తూండేది. ఆ సమయంలో చాలా ఎక్కువ జబ్బుతో బాధపడుతున్నవారికి స్వాస్థ్యం చేకూర్చేందుకు బాబావారిచ్చిన నూటఎనిమిది ముత్యాలతో కూర్చిన జపమాలకూడా యిస్తూండేదానిని. నాదగ్గర యోగాభ్యాసం నేర్చుకొంటున్నవారు కృతజ్ఞతాభావంతో కూడిన ఆనందబాష్పాలతో స్వామి తమకందచేసిన అనేక అనుభవాలను గురించి తెలుపుతుండేవారు. ఒక ప్రొఫెసర్ "బి" అనే ఆయనను ప్రభుత్వమే "సాయి యోగం" ద్వారా స్వాస్థ్యం చేకూర్చడంకోసం నావద్దకు పంపింది. డాక్టర్లకు తెలియని కారణాలవల్ల ఆయన ఒక విచిత్రమైన రోగంతో బాధపడేవారు. ఆయన కాళ్లు ఆరోగ్యవంతంగా దృఢంగా పైకి కనపడనప్పటికీ నూటయాభై అడుగులకి మించి నడవలేకపోయేవారు. నా నలభైయేండ్ల యోగాభ్యాస అనుభవకాలంలోనూ అటువంటి రోగాన్ని చూడలేదు. ఆయనకు కొంచెం విభూతిని నీటిలో కలిపి తాగమని యిచ్చి, కొంచెం ఆయన కాళ్ళమీద రుద్దాను. ఆయనకు జపమాల యిచ్చి చేతితో పట్టుకొని ప్రార్థన చేస్తుండగా విభూతిని రుద్దాను. ఆశ్చర్యం! మరుసటిరోజు ఆయన మామూలుగా ఎట్టి ప్రయాస లేకుండా మైళ్ళకొద్దీ దూరం నడవగలిగారు.

భర్తను కోల్పోయిన ఒక స్త్రీకి ఒక కుమార్తె వున్నది. ఆ కుమార్తె తన తండ్రిని కోల్పోయిన దుఃఖంలో తనకప్పుడే కలిగిన బిడ్డ ముఖంకూడా చూడలేదు. నేను ఆసుపత్రికి పోయి ఆమెను చూసిన సమయంలో ఆమె ఆ బిడ్డను వదిలేసి నన్ను తప్పించుకొని

పోయింది. ఆ భర్తలేని స్త్రీకి కొంచెం విభూతి యిచ్చి ఆమె కుమార్తెకు కొంచెం నీటిలో కలిపి ఇవ్వమని చెప్పి నేను వచ్చివేసాను. ఆ మరుసటిదినం ఆ బిడ్డ తల్లి తన బిడ్డను తీసుకొని పాలిచ్చి తండ్రి గురించిన దుఃఖాన్ని పోగొట్టుకొన్నది.

ఏథెన్స్ నగరములో చాలామంది భక్తులు స్వామి గురించి వినడానికి స్వామికి సంబంధించిన చలన చిత్రాలు చూడడానికి ఎంతో ఉత్సాహం ఆసక్తి కనపరిచారు. వారందరికీ ఆనందం కలిగించిన తరువాత నేను కాలిఫోర్నియా, మెక్సికో, సాన్‌సాల్వెడార్, గ్వాటిమాల పట్టణాలు దర్శించడానికి బయలుదేరాను.

స్వామి సందేశం లాటిన్ అమెరికా దేశాలన్నింటిలో—మెక్సికో కానివ్వండి, గ్వాటిమాలాకానివ్వండి, సాన్‌సాల్వెడార్ కానివ్వండి లేదా పెరూ దేశములోని లిమాలో అయితేనేమీ—ఉరకలువేస్తున్న ఉత్సాహంతో అందుకోబడుతోంది. లక్షలాదిమంది పెదాలపై బాబా వారి నామం నాట్యం చేస్తున్నది. వేలాదిమంది హృదయాంతరాళాల్లో వారి సందేశం నిండిపోయింది. వారిపై విశ్వాసం దృఢంగా పెంపొంది అనేక నిదర్శనాలను చూపిస్తూ, వివిధ మహిమాన్వితమైన ప్రదర్శనాలద్వారా వ్యక్తమవుతున్నది. భగవాన్ ఫోటోలున్న జాగాల్లో ఇది ఇంకా ఎక్కువగా జరుగుతున్నది.

గ్వాటిమాలాలో నాదగ్గర యోగం అభ్యసిస్తున్న ఒక విద్యార్థిని తన స్వప్నంలో స్వామి విగ్రహము తయారుచేస్తున్న అనుభూతి పొందింది. తెల్లవారి ఆమె తల్లి నిద్ర లేపడానికి వచ్చి, ఆమె చేతులకున్న మట్టిని చూసి ఆశ్చర్యపోయింది. చెప్పుల దుకాణం నడుపుతున్న మరో మహిళ ప్రశాంతినిలయం దర్శించి వచ్చిన అనంతరము పొందిన అనుభవం మరింత చిత్రమయినది. వచ్చిన మరునాడు ఆమె దుకాణానికి ముగ్గురు సాయుధులైన దుండగులు వచ్చి ఆమె దగ్గర వున్న డబ్బు యిమ్మని వేధించసాగారు. తక్షణము ఆమె బాబావారిని సహాయంకోసం ప్రార్థించసాగింది. ఆమెమీద తుపాకి గురిపెడుతున్న ఒకవ్యక్తి వెంటనే "మాకు ఎవరో తప్పుడు సమాచారము యిచ్చారు క్షమించాలి. మాకు చెప్పులు ఇవ్వండి'' అని ఆమె యిచ్చిన చెప్పులు తీసుకొని పోయారు. ఎంతో పెద్ద చోరీ—అణాకానీ విలువచేసే చెప్పులతో సమసిపోయింది.

చిత్రాతిచిత్రంగా బ్రతికి బయటపడ్డ హెర్నాండెజ్ క్వినానెజ్‌వల్ల స్వామి సర్వవ్యాపకత్వం, సర్వశక్తిత్వంలో నమ్మకం సాన్‌సాల్వెడార్ ప్రజల్లో బాగా నాటుకుపోయింది. హెర్నాండెజ్ తన భార్యతో ఒక రోజు తన అవులను చూచుకొని సాన్‌సాల్వెడార్ తిరిగి వస్తున్నారు. త్రోవలో సాయుధులైన బందిపోట్లు కారును ఆపి తుపాకి చూపిస్తూ ఆయన వద్దనున్న రివాల్వరును రెండువేల అమెరికన్ డాలర్లను ఇమ్మంటూ బెదిరించారు. దుండగులు ట్రంకుపెట్టె వెతుకుతూంటే, గజ గజ వణుకుతూ హెర్నాండెజ్ దంపతులు బాబావారిని ప్రార్థించడం మొదలుపెట్టారు. ఆశ్చర్యం కలిగే విధంగా వారిలో ఒకవ్యక్తి హఠాత్తుగా కారుకిటికీలోంచి వారి ధనం, రివాల్వరూ అందించి చీకటిలో కలిసిపోయాడు. ఈ పరిణామానికి దంపతులిద్దరూ అవాక్కయ్యారు.

ఒకరోజు పెరూదేశంలో విమానగరములో ఎలిజబెతా మాల్డొనాడొ అనే వైద్యుడి భార్య తన భర్త ఆసుపత్రికి తీసుకెళ్ళింది. అక్కడ తమ ఆసుపత్రిలో పూజామందిరముగా మార్చిన ఒక గదిని చూపించింది. ఆమె పోయినసంవత్సరము ఎలాంటి మందులవల్ల నయంకాని రోగాన్నించి ప్రశాంతినిలయంలో బాబావారు నయంచేసిన తరువాత యింటికి తిరిగివచ్చి ఆ పూజా

మందిరము ఏర్పాటు చేస్తూవున్నది. ఎలిజబెటా స్వామి పటంముందున్న ఎర్రటి తివాచీమీద శిలువరూపములో అమర్చబడ్డ పసుపుపచ్చని పూరేకులను చూపించి "ఈ మహిమగురించి ఏమంటావు?" అన్నది. ఇంకా "నిన్నరాత్రి రెండు ప్లవరువాజుల్లో తాజాపూలను అమర్చి వుంచాను. తెల్లవారేసరికి ఈ పూరేకులు వాటంతటవే వాజులనుండి విడిపోయి ఈ రూపములోకి మారుతున్నాయి. ఉదయము దీనిని చూసి ధ్యానంలో కూర్చొని కళ్ళనిండా ఆనందబాష్పాలతో స్వామి అనుగ్రహాన్ని ప్రతిబింబించే చిహ్నాన్ని చూపవలసినదిగా ప్రార్థించాము. దానిమీద ఒక స్వామిపాదం గుర్తు క్కడే క్రొవ్వొత్తుల వెలుగులో మెల్లగా కనపడింది. దాని తరువాత ఏమయిందో మీకు కనీసము ఊహకయినా అందదు. ఇక్కడున్న ప్రతివారు దానిని చూసి ముట్టుకోవడంకోసం ముందుకు పరుగెత్తారు. ఆ అనుగ్రహచిహ్నాన్ని అందుకొన్నక్షణంలో ప్రతివారు ఏడుస్తూ ప్రార్థిస్తూ, ఒకరినొకరు కౌగలించుకొని తమ మోకాళ్ళమీద పడి ఆనందాతిరేకులయ్యారు. కాని వాళ్ళంతా వెళ్ళిపోయాక చూస్తే ఆ శిలువరూపమంతా చెల్లాచెదరైపోయింది" అంటూ ఎలిజబెటా అనుగ్రహ చిహ్నాన్ని చూపిన భక్తులు ఎవరికి దొరికినన్ని పూరేకులను వారు యిళ్ళకి తీసుకొనిపోయారు. వారిని ఆపుదామన్నా నాకు మనసు రాలేదు. విచారముతో హృదయం నిండిన నేను తిరిగి శిలువరూపములో పూరేకులు నిండేట్లు చేయమని బాబావారిని ప్రార్థించాను. ఏడువారాల తర్వాత మొదటవున్న పూరేకులు వాటి తాజాతనం అట్లే వుంటుండగా, స్వామి నాప్రార్థనను మన్నించారు. ఆ భక్తులు తీసుకుపోయిన పూరేకుల ఖాళీస్థలములో తాజా బంతిపూరేకులు వచ్చి నిండాయి" అని ముగించింది. ఆ దైవస్థానంముందు నేను మోకరిల్లాను. ఎర్రటి తివాచీమీద బంతిపూలరేకులు తదితర పూరేకులతో కూర్చబడిన శిలువ దానిమీది స్వామి పాదపు గుర్తు చెక్కుచెదరక అట్లే నిలిచివున్నాయి. సాయి సర్వవ్యాపకత్వానికింతకంటే నిదర్శనమవసరమా?

ఇంద్రాదేవి

# నా అనుభవం

1979వ సంవత్సరాంతంలో బొంబాయి నగర జీవితమునుండి దూరంగా, విశ్రాంతిగా, శాంతిగా కొద్ది రోజులుండడానికి ప్రశాంతినిలయము పోవాలనే ఆలోచన కలిగింది. 1980వ సంవత్సర ప్రారంభములో బాబావారి దయవల్ల కుటుంబంతోసహా బొంబాయినుండి పుట్టపర్తి సౌఖ్యంగా అనాయాసంగా చేరగలిగాను. నాలుగు వారాలపాటు హాయిగా ప్రశాంతినిలయ ఆవరణములో మకాం పెట్టుకొని కాలం గడిపాను.

ప్రశాంతినిలయములో నన్ను ముఖ్యంగా ఆవరణలో గల పరిశుభ్రత ఆకర్షించింది. సేవాసక్తి కల భక్తులే ఎట్టి వత్తిడి లేకనే ఆశ్రమ ఆవరణను పరిశుభ్రంగా వుంచుతారు. వందలాది మంది మసలుతున్నప్పటికీ క్రమశిక్షణకూ, నిశ్శబ్దతకూ భంగం కలగకుండా ప్రవర్తిస్తారు. శుభ్రంగా రంగులు వేయబడ్డ ఆశ్రమ భవనాలు, సౌందర్యంతో అలరారుతున్న మందిరం, పది వేలమందికి పైగా కూర్చునేందుకు వీలయిన ఆడిటో

రియం, శుభ్రతతోకూడిన విశాలమయిన భోజనశాల, ప్రశాంతినిలయ పవిత్రతను అనుక్షణం గుర్తుచేస్తుంటాయి. ఉల్లాసం కలిగించే గ్రామీణ వాతావరణం, ఆశ్రమం దగ్గరలో వున్న నదీతీరంలోను, ఆశ్రమము ప్రక్కగా వున్న, ఆశ్రమం దగ్గరిలోవున్న పర్వతశ్రేణుల్లోనూ దర్శనమిస్తుంది. ఎక్కడా అనుభవంలోకి రాని దివ్యమైన మానసిక శాంతి, నిశ్శబ్దం ఈ ఆశ్రమములో అనుభవించగలుగుతాము. మేము వెళ్ళిన మొదటి కొద్దిరోజులు బాబావారు ఆశ్రమములో లేనప్పటికీ, వారి ఉనికి చాలా రకాలుగా అనుభవించ గలిగాము.

మేము వెళ్ళినది పండుగల కాలం కానప్పటికీ ఆశ్రమమునిండా భక్తులున్నారు. కొందరు అక్కడ శాశ్వతనివాసం ఏర్పరచుకొన్నవారయితే, మరికొందరు మా లాగా వచ్చిపోయేవారు. భక్తులంతా ప్రాతఃకాల ధ్యానములోనూ, నగరసంకీర్తనలోనూ, మధ్యాహ్న సాయంకాల సమయాల్లో జరిగే భజన సమయాల్లోనూ పాల్గొంటారు. బాబావారున్నప్పుడు స్వామి దర్శనార్థం మందిరం ఆవరణలో స్త్రీ పురుషులు వేర్వేరు ప్రదేశాల్లో, రెండుపూటలా కూర్చుంటారు. ఎంతమంది వున్నా నిశ్శబ్దం తాండవించేది.

ప్రశాంతినిలయం పుట్టపర్తి గ్రామాన్ని ఆనుకొని వున్న చిన్న పట్టణవాటిక, భారతదేశములో వివిధప్రాంతీయులకి విదేశీయులకి వలసిన వసతులను దృష్టిలో పెట్టుకొని నిర్మించబడినది. సాయిబాబావారు ప్రశాంతి నిలయములో వున్నప్పటికీ అక్కడ జరిగే కార్యక్రమాలు, క్రమబద్ధంగా జరిగిపోతూనే వుంటాయి. ప్రపంచములోని నాలుగు మూలలనుండి స్వామి దర్శనార్థం తమతమ కోర్కెలు తీర్చుకోవడంకోసం ప్రశాంతినిలయము చేరుతుంటారు. మేము వున్న నెల రోజుల్లోనూ, ప్రతిరోజూ దాదాపు ఏడునుండి, ఎనిమిది వందల మంది స్వామి దర్శనార్థం బారులుతీరి కూర్చొనే వారు. అందులో రెండువందలకి పైగా విదేశీయులు. అటువంటి నిశ్శబ్దమైన అంతర్జాతీయ వాతావరణం ప్రశాంతినిలయ వాతావరణంలోనే చూడగలిగాను.

ప్రపంచములో ఎక్కడా లభ్యంకాని ప్రేమ. శాంతి దైవత్వం ప్రశాంతినిలయములో పొందగలిగాము. ఎన్నో మైళ్ళ అవతలనుండి వచ్చిన విదేశీయుల భక్తి శ్రద్ధలు మనుష్యులనాకట్టుకుంటాయి. వారు అత్యంత భక్తిశ్రద్ధలతో భజనలను సరియయిన స్థాయిలో, శ్రావ్యమైన విధముగా, రాగయుక్తంగా గానం చేయడము ప్రతి వ్యక్తినీ ఆకర్షిస్తుంది. కొందరు గాయత్రిని తమ తమ బసల్లో శ్రవణ పేయంగా పఠిస్తుంటారు. అన్ని కార్యక్రమాలు పరిశుద్ధమైన వాతావరణములో క్రమశిక్షణతో నడిచిపోతాయి. ఉబుసుపోక కబుర్లుకానీ చాడీలు చెప్పుకోవటంకానీ, వెకిలిచేష్టలూ వెక్కిరింపులుగానీ, మచ్చుకుకూడా కనబడవు. ప్రతివ్యక్తి తనకి నిర్దేశించబడిన పనిని సేవాభావముతో వినయము వుట్టి పడుతుండగా, ఆ ప్రేమతో చేసుకొనిపోతూ మిగిలిన కాలాన్ని ఆధ్యాత్మిక సాధనలో వినియోగిస్తుంటారు.

బాబావారు ప్రేమ, సేవాభావం, వినయం, క్రమశిక్షణలను గురించి నొక్కి చెబుతుంటారు. మన దినచర్యలో అవి భాగం కావాలని వక్కాణిస్తారు. స్వామి ఎల్లప్పుడూ తెలిపే "అందరినీ ప్రేమించు, మంచినే చేయి" అనే వాక్యాలు ప్రశాంతినిలయమంతా వ్యాపించినట్లు తోచింది.

శ్రీ సత్యసాయి ట్రస్టువారిచే వివిధ ప్రదేశాల్లో నడపబడుతున్న పాఠశాలలు, కళాశాలలేకాక, చాలా విద్యాసంస్థలు. సాయి సంస్థలతో సంబంధాల నేర్పాటు చేసుకొంటున్నవి. పుట్టపర్తిలో శ్రీ సత్యసాయి

ట్రస్టు ఆధ్వర్యములో నడుస్తున్న ఉన్నత పాఠశాల, కళాశాల వున్నవి. బాబావారు తమ సమయములో వీలయినంత బాగా రాబోయే తరాలవారి విద్యగురించి, వారిని ప్రేమతో సరియైన మార్గములో తీర్చిదిద్దడా నికి వినియోగిస్తుంటారు. ప్రపంచములో ప్రతిచోటా మనం ఈనాడు సాత్వికగుణము అడుగంటి, తామసిక, రాజసిక గుణాలు తాండవిస్తున్నాయి. ప్రస్తుతము మన దేశములో పాఠశాలల్లోనుండీ, కళాశాలల్లోనుండీ వేల కొద్దీ యువజనులు నిరాశాభరితులై, అసమగ్ర విద్యా వంతులై నీతి నిజాయితీలగురించి ఏమాత్రము నేర్చు కోకుండా బయటపడి దేశములో భీతావహమయిన పరిస్థి తికి కారణభూతులవుతున్నారు. అట్లాంటివారికీ పుట్ట పర్తి స్వామి కాలేజి విద్యార్థులకీ పోలికేలేదు. స్వామి విద్యార్థులు వినయం, ప్రేమ, సచ్ఛీలం రూపముగా కలి గినవారు. వారు రేపటి సార్థకమైన పౌరులుగా తప్పక రూపొందుతారు. ఇతరులకి మార్గదర్శకులవడమేకాక, ప్రస్తుతం దారీ తెన్నూ కానక కొట్టుమిట్టాడుతున్న విద్యావేత్తలకూ, విద్యాధికారులకీ వారు ఆదర్శప్రాయు లవుతారు.

దైవంతో కనీసము కొద్ది క్షణాలపాటు చనువు సం పాదించాలని ఆక్రోశించే వేలాదిమంది ప్రజలకి స్వామి యిచ్చే దర్శనము ఒక అపూర్వమైన అనుభవము. స్వామి దర్శనము ఆ ప్రజలను ఉన్నత శిఖరాలకి కొని పోయి దైవసన్నిధిలో నిలబెడుతుంది. అది ఒక కొనకంటి చూపే కావచ్చు, చిరునవ్వే కావచ్చు, చిన్న హస్తస్పర్శ కావచ్చు, ఇంకా అదృష్టమంటే హస్తచాలనముతో సృష్టించిన విభూతి రూపము దాల్చ వచ్చు.

పరిశుభ్రమైన ఇసుకపై బారులుతీర్చి ఎండ తీవ్రతను కూడా లెక్కచేయక స్త్రీ,పురుష, బాలవృద్ధులు స్వామి దర్శనంకోసమూ ఉదయము, సాయంత్రము ఎదురు చూస్తూ వుంటారు. చిన్నదైనప్పటికీ రాజఠీవి ఉట్టి పడుతున్న దివ్యత్వరూపంగా మూర్తీభవించిన స్వామి చిన్నగా నడుస్తూ భక్తులను సమీపిస్తారు. హస్త ములలో ఒకదానిని ఆకసము దిశ మెల్లగా కదుపుతూ మందగమనముతో, బారులుతీరి కూర్చొన్న భక్తులను చూస్తూ, కదులుతారు. తమ అనేక చర్యలద్వారా భక్తుల హృదయాలకానందము అందచేస్తూ వుంటారు.

బాబావారిపైగల భక్తి విశ్వాసాల ననుసరించి ఆయా వ్యక్తులకి స్వామి దయ, అనుగ్రహము, ప్రసంచి ఆయా సంఘటనలు ఊహించని రీతిలో రూ పొందుతుంటాయి. స్వామి మన భారాన్నీ, కష్టాలనూ తనకందించి, తనిచ్చే సంతోషాన్నీ, శాంతినీ, తీసుకు పొమ్మని చెబుతారు. అంతేకాక మనము వారిని పూర్తి విశ్వాసముతో పిలిచిన తక్షణము మనచెంత నిలుస్తానని అభయమిస్తారు.

"నాలోవున్న అనుభవం పొందండి. అందరితో ప్రేమతో మెలగి, అందరికీ సేవ చేయుండి" అని చెబుతుంటారు. మనలో ప్రవహించే దివ్యమైన కిర ణాల తీవ్రతనుబట్టి మన ప్రవర్తన, మనం చూపే ప్రేమ, సేవాభావము ఆధారపడతాయి. స్వామి దర్శనము ఈ సందేశాన్ని తెలియపరుస్తుంది. ఇంతకంటే మనకేమి కావాలి.

ఎస్. డి. నడకర్ణి
బొంబాయి

# తానే వచ్చిన తండ్రి

మానవులలో చాలామందికి, ముఖ్యముగా పాశ్చాత్యులకు, ఒక మానవుడు వేరొక మానవుని ముందు మోకరిల్లుట, మరొక మానవుని పాదములను చేతులతోను ఫాలభాగముతోను స్పృశించుట, పెదవులతో ముద్దు పెట్టుకొనుట, చాలా అసహజముగాను, అస్వాభావికముగాను కనిపించును. మేము భారత దేశము వెళ్ళక పూర్వము నా భర్త రాన్ (Ron) కూడ యీ పాదములను ముద్దు పెట్టుకొనుట వంటివి నాకేమీ పట్టవు. నామట్టుకు నేను స్వామిని నా హృదయము నిండా నింపుకున్నాను. హృదయములో నిలుపుకున్నాను. తిన్నగా వెళ్ళి 'స్వామీ, నేను రాన్‌ని' అని ఏ ఆర్భాటము లేకుండా చెప్పగలను అని నాతో అన్నప్పుడు, ఆ మాటలు విని, నాలో నేను నవ్వుకొన్నాను. 'సరేలే, చూస్తూ వుండండి. ఈ విగ్రహము అంతా స్వామి చూసేవరకే. స్వామి మానవరూపము ధరించి వచ్చినంత మాత్రమున మానవ మాత్రులు కారు' అని హెచ్చరించాను.

మనము కేవలము మానవులము కనుక మన గాఢమైన భావాలను, అంతఃతృష్ణలను, ఆర్తిని శారీరకమైన చర్యలద్వారానే బహిర్గతము చేయగలము. మనలోని ఆర్తి, భగవంతునికొఱకైన ఆర్తి, తీవ్రతరమైనపుడు, మనము ఆడుతాము, పాడుతాము, భజన చేస్తాము, స్తోత్రము చేస్తాము, చిట్టచివరకు పట్టలేక భగవంతుని పాదపద్మముల సన్నిధిని అర్పణాపూర్వకముగా కుప్పకూలిపోతాము. స్వామికి భక్తులలోని, భాగవతులలోని, సాధకులలోని యీ ఆవేదన, ఆర్తి, వాని తీవ్రత, ఉద్వేగత, ఉత్కంఠత, అవి తమ గమ్యస్థానమును చేరినపుడు. 'ఘన సింధువును చేరెడి గంగభంగి' ఎలా సాయుజ్య భావాన్ని స్పర్శారూపకముగా పొందుతవో బాగుగా తెలుసును. కనుకనే మనము నదులలాంటి మనము ఎక్కడనో జన్మించి, భక్తితో కరగిపోయి నపుడు, వేలమైళ్ళు ప్రయాణించి, ప్రవహించి, స్వామి పాదపద్మముల దగ్గరకు, యీ కరుణాసాగరుని క్రోలకు, చేరినపుడు, మనలను, నదులను, జీవనదులను, మన శరీరములను గూడ, తమ పాదపద్మములను స్పృశించి, చుంబించి, ఐక్యతాభావాన్ని, సాయుజ్యానుభూతిని ఆత్మపరం చేసికోనిస్తారు. ఇదంతా మన ఆనందానుభవానికే.

సముద్రమునకు-ఒక విధముగా చూస్తే-నదుల అవసరము లేదు. మరి స్వామికి మన పాదప్రణామములు అవసరమా? ఆశ్రమములో స్త్రీలు, పురుషులు, స్వామి పాదారవిందములను ఎంతో భక్త్యావేశముతో, ఆర్తితో ఆనందముతో, స్పృశిస్తూ, కండ్లకు అద్దుకుంటూ, తమ కండ్ల వెంబడి ప్రవహించే ఆనందాశ్రువులను తుడుచుకోవటానికి గూడ చేతులను వెనుకకు తీసుకోలేని స్థితిలోవున్నా, స్వామి మాత్రము యివి ఏవీ పట్టనట్లుగా, యీ స్పృహయే లేనట్లుగా సాగిపోతూవుంటారు. తరచుగా. యీ సంపూర్ణ శారీరక స్పర్శాతీతస్థితి,

ప్రవర్తన సామాన్య మానవులకు సాధ్యముకాని విషయమేమోననిపిస్తుంది.

ఈ సందర్భములో ఒక ప్రముఖ తత్వ సాహిత్య మానసిక శాస్త్రములలో పండితుడైన విశ్వవిద్యాలయాధ్యక్షుడు స్వామిని గురించి చెప్పిన మాటలు గుర్తుకొస్తున్నవి. ఆయన అంటారు "నేను మొదటిసారిగా యీ అంతుచిక్కని (అనంతుడుగదా మరి) మనిషి నడుస్తూ వుండగా చూసి 'యీయనెవరో దివినుండి భువికి యీ భూమిని పావనము చేయుటకు దిగివచ్చిన వ్యక్తో శక్తో కాని, సామాన్యులు కారు. వీరితో ఎలాగు మెలగటము? మసలటము? మాట్లాడటము? అందరూ ఆయన పాదధూళిని నోట్లో వేసుకొంటే, నేనుకూడా అలాగే దానిని ప్రసాదములాగ స్వీకరిస్తాను అని. కాకపోతే, సామాన్యముగా సహజోద్రేకాలకు లోనుగాని ఒక దక్షిణాఫ్రికా న్యాయవాది, స్వామిని దర్శించిన తరువాత తన డైరీలో, అమ్మయ్య! ఎంతకాలానికి స్వామి నన్ను చూసి చిరునవ్వుతో పలకరించారు. . . ." అని పులకరించిపోతాడా?

ఈ ఆలోచనలతో, జ్ఞాపకాలతో, ఎట్టకేలకు మేము నిరాడంబరముగానున్న స్వామి గదిలోనికి, అవతార పురుషుని సన్నిధిలోనికి చేరాము. అయితే రాన్ విగ్రహమంతా ఏమయిందో మరి? కన్నుల వెంబడి బాష్ప ధారలు కురుస్తూవుండగా "స్వామీ! నాఅదృష్టాన్ని నేనే నమ్మలేకుండా వున్నా" నంటూ స్వామి పాదాలపై ఒరిగిపోయారు. ఇక నేనైతే, స్వామి పాద సరోజాలను రెండు చేతులతో పట్టుకొని ముద్దుపెట్టుకొన్నాను. కాలప్రవాహము స్తంభించిపోయి, యీ క్షణము కలకాలముగా మారకూడదా! అని ఆక్రోశించాను మనస్సులో 'లే, లె'మ్మంటూ స్వామి చూపిన మృదు హస్తాన్ని కూడ ముద్దిడకుండా వుండలేకపోయాను.

స్వామి తన రెండవ చేతిని రాన్ భుజముపై వాల్చి 'మా మంచివాడు' అన్నారు మందహాసము చేస్తూ. స్వామి సాంత్వనపు పలుకులకు ఉక్కిరి బిక్కిరై, పొంగి పొరలుతూ వున్న వా భాష్పధారలను దాయటానికి వంచిన నా శిరస్సును స్వామి తడుముతూ, నిమురుతూ దీవించారు.

ఎలాగోలాగు తేరుకొని నేను 'స్వామీ! మీరు అప్పుడప్పుడు మా యింట్లో వున్నట్లుగా ఒక అనిర్వచనీయమైన అనుభూతిని పొందుతూవుంటాము!' అని అనగలిగాను. స్వామి క్షణమాగి, నేను మీ హృదయవాసిని. అయితే, రెండుసార్లు నీవు స్వప్నావస్థలో నున్నప్పుడు మీ దగ్గరకు వచ్చాను. నీవేమో అది భ్రాంతి అనుకొన్నావు' అంటూ నా మెడలోనున్న హారములోని పతకమును పట్టుకొని పవిత్రము చేశారు. నేను మనస్సులో ప్రార్థిస్తూ వున్నదికూడా దీనికొరకే. స్వామిదగ్గరనుండి వస్తు సేకరణ కాంక్షలేకుండా, అనుసంపాదనాకాంక్షతో. సఫలీకృతాశయముతో తిరిగి వెళ్ళాలని.

ఇంతలో రాన్ స్వామికి తాను జీసస్ క్రైస్తుకు, సత్యసాయిబాబాకు గల సాదృశములను వివరిస్తూ వ్రాసిన వ్యాసమును సమర్పించారు. స్వామి అందలి మొదటి వాక్యములను తనలోతాను చదివి, యీసాదృశా నిరూపణా ప్రయత్నమునకు అనుమతియేనన్నట్లుగా, ప్రసన్న వదనముతో, తిరిగి రాన్‌కు యిచ్చినారు, తిరిగి ఒకరోజు ఆగి రమ్మని చెప్పుతూ. ఎంతో ఆర్ద్రతతో, అప్యాయతతో, మృదువుగా, మధురముగా మా కండ్లలోనికి చూస్తూ, మందహాసముచేస్తూ, ఆకాశములో తేలియాడుతూ వున్నట్లుగా భ్రాంతి కల్పించే, వర్ణనాతీతమైన మందగమనముతో లోనికి వెళ్ళినారు. స్వామి ప్రేమావతారమంటే ఏమిటో మాకు ప్రత్యక్షానుభవము

లోనికి, స్వానుభవములోనికి, మరపురాని విధముగా ముద్రవేస్తూ వచ్చింది. ఎప్పుడైనా స్వామి కఠినముగా కన్పించినా, అది మనలను సరియైన మార్గములో తీర్చి దిద్దుటకు, తెచ్చిపెట్టుకొన్న కృత్రిమ కాఠిన్యమే. మూలవిరాట్టు అంతా శుద్ధప్రేమ సుద్దయే; స్వామియే చెప్పినట్లు స్వామి ప్రేమతత్త్వముయొక్క సత్యాన్ని అనుభవించి గుర్తించవలసినదేగాని, పరిశీలించి, ఆలోచనా పూర్వకముగా అర్థము చేసికొనుట అసాధ్యము.

మూడవ దినము మేము స్వామి సన్నిధిలోనికి వెళ్ళగనే తమ దివ్య హస్తచాలనముతో సృష్టించిన విభూతిని తినుటకు ప్రసాదించారు. స్వామి చాలా సామీప్యములో కూర్చొని చాలా విషయములను గురించి-ప్రత్యేకముగా-విశ్వాంతరాళమునుండి మన భూగోళము వైపు వచ్చు యాత్రికులను గూర్చి, నిర్మలమైన మనస్సులుగల "మీడియం"లద్వారా చనిపోయినవారి ఆత్మలతో సంభాషణలు చేయుట-శాస్త్రవిజ్ఞాన సముపార్జన కొఱకు యితర ప్రాణులను-ప్రత్యేకించి పశు, పక్ష్యాదులను దుర్భరహింసలకు గురిచేయుట-అడిగినాము. చివరి విషయమును గురించి మాట్లాడునప్పుడు స్వామి 'ఆవేదనా పూరితకంఠముతో' మానవుడు సర్వప్రాణి కోటిలోని ఏకత్వమును, భగవంతుని సర్వాంతర్యామిత్వమును గుర్తించాలి' అని అన్నారు.

మేము స్వామి భవిష్యదవతారమును గురించి, షిర్డి సాయి శివావతారముగను, సత్యసాయి శివశక్తుల సమ్మేళనావతారముగను, ప్రేమసాయి శుద్ధ శక్త్యావతారముగాను వ్రాయబడ్డ విషయమును గురించి అడుగుతూ "స్వామి ప్రేమసాయి శరీరము-శక్తి-అవతారము గనుక స్త్రీ రూపములోనుండునా'' యని సందేహమును వెలిబుచ్చితిమి. స్వామి "కాదు పురుషావతారమే. కర్ణాటక రాష్ట్రములో'' ననిరి. నేను చాలా కాలమునుండి అడుగదలచుకొన్న ప్రశ్న "క్రైస్తుయొక్క పునరుజ్జీవింపబడిన శరీరము-రిసరెక్టెడ్ బాడీ-మొదట-అసలైన భౌతిక శరీరమా; లేక ఆత్మచే అప్పటికప్పుడు సృష్టింపబడిన శరీరమా?" దీనికి స్వామి జవాబు "అది మొదటి అసలైన భౌతిక శరీరమే" నని. అందుచేతనే, మనకు క్రైస్తు సమాధిలో భౌతిక దేహము తర్వాత దొరకక పోవడము.

గతాన్ని గూర్చిన యీ విషయములు చారిత్రక సత్యనిరూపణకు ఉపయోగకరములు. ఇక ప్రస్తుత యుగములో మానవుడు దివ్యత్వము సాధించే మహత్తర ప్రయత్నములోనున్న దశలో సత్యసాయిగా అవతరించిన యీ పరమేశ్వర శక్తి, క్రైస్తు తన తర్వాత యీ ప్రపంచములోనికి వస్తారని చెప్పిన తన తండ్రి-Father-తత్త్వమేనా? ఆయన పేరు సత్యమని ఆయన అరుణ వర్ణాంబరమును ధరించుతారని, ఆయన అంత పొడగరికాక, కుంతల కిరీటమును ధరించి వస్తారని, చెప్పినది మిమ్ములను గురించియేనా?" అని అడిగిన దానికి జవాబుగా, స్వామి నిశ్చలముగా, నిబ్బరముగా, మృదువుగా తమ సహజ సత్య శైలిలో "అవును'' అంటూ తల పంకించారు. ఉండబట్టలేక రాన్ తిరిగి, సూటిగా "అయితే పాశ్చాత్యులు యింత కాలముగా భావన చేస్తూ వుండిన క్రైస్తు తండ్రి మీరేనా?'' అడిగినపుడు స్వామి తిరిగి నిస్సంకోచముగా, నిర్ద్వంద్వము [illegible] సహజ ధోరణిలో మరపురాని మధురకంఠముతో 'అవును' అని పునఃరుద్ఘాటించిరి.

శ్రీ పెగ్గి మెసన్

# భూవలయమే ప్రశాంతినిలయము

శ్రీమద్భగవద్గీతలో "భగవంతుడి దివ్యత్వం తెలుసుకోగలిగినవారు, తమ అనుభవాలను ఇతరులతో పంచుకోవడంలో గొప్ప ఆనందాన్ని విశ్వాసాన్ని పొంది అనిర్వచనీయమైన అనుభూతిని పొందుతారని" చెప్పబడింది. ప్రపంచంలో వివిధ దేశాలకి చెందిన కోట్లాది మంది హృదయాలను సత్యసాయి పట్ల ప్రేమఅనే బంధం కలుపుతూంది. ఈ బంధం భగవాన్ జన్మదినోత్సవానికి ఒకవారం రోజుల ముందర (వచ్చే శని-ఆదివారాల్లో) ప్రపంచమంతా జరుపబడే ఇరవైనాల్గు గంటల అఖండభజనగా రూపుదిద్దుకొంటుంది. ఆ ఇరవైనాల్గు గంటలూ దైవానికిగల వివిధ నామాలను నలుమూలలా మారుమ్రోగించి, శామానందిస్తారు సాయిభక్తులు. 1975వ సంవత్సరంలో ప్రశాంతినిలయంలో జరిగిన ప్రపంచ శ్రీసత్యసాయి సంస్థల రెండవ ప్రపంచ సమ్మేళనం, ప్రపంచం నలు దిశల నుండి సాయి భక్తులను ఒకచోటికి చేర్చడానికి తావిచ్చింది. తిరిగి ఎప్పుడు ఒకచోట చేరి సాయిదర్శనం పొంది, ఆనంద కందళితులమవుదామా అని ఉర్రూతలూగుతున్న అశేష మానవాళికి అయిదు సంవత్సరాలు అయిదువందల యుగాలరీతిగా తోచడంలో అబ్బురం ఏమీలేదు. వారి మానసాల ఉత్సాహాన్ని భగవాన్ గమనించి శ్రీ సత్యసాయి సేవా సంస్థల మూడవ ప్రపంచ సమ్మేళనాన్ని స్వామి జన్మదినోత్సవవారంలో ఏర్పాటు చేయుటకు ప్రపంచ సమితికి అనుమతి ప్రసాదించారు.

1975లో జరిగిన ప్రపంచసమ్మేళనంకంటే ఈతూరి పాల్గొన్న ప్రతినిధుల సంఖ్య, ఉత్సాహం వర్ణనాతీతం అంటే ఆశ్చర్యం ఏమీలేదు. వెస్ట్ ఇండీస్, ఆఫ్రికా ఖండం, ఈశాన్య ఆసియా, అమెరికా, ఐరోపా, ఇతర తూర్పు దేశాలనుండి చాలా పెద్దసంఖ్యలో ప్రతినిధుల బృందాలు వచ్చినాయి. భారతదేశంలో కూడా సేవా సంస్థలు అసంఖ్యాకంగా పెరిగిపోవడంతో భారతీయ ప్రతినిధులు చాలా ఎక్కువమంది ఈసారి సభలకు హాజరయ్యారు.

అంతరాంతరాల్లో నిబిడీకృతమైవున్న అచంచలమైన భక్తివిశ్వాసాలు పెల్లుబుకుతుండగా తమ ఆరాధ్య దైవం ప్రత్యక్షదర్శనాన్ని కాంక్షిస్తూ, తమ హృదయం తృప్తిచెందే రీతిగా స్వామిని కాంచేందుకు తొందర పడుతూ సుదూర తీరాలనుండి, ప్రశాంతినిలయం అమితవేగంతో చేరుతున్న అసంఖ్యాక ప్రతినిధులకూ భక్తులకూ ఆదరంతో స్వాగతం చెప్పేందుకు ప్రశాంతి

నిలయం సర్వసన్నద్ధమైనది. శ్రీ సత్యసాయి విద్యాగిరి ఆవరణంలో నూతనంగా నిర్మించబడ్డ సత్యసాయి కళాశాల, ప్రాథమిక పాఠశాల, విద్యార్థి వసతిగృహం రెండువేలమంది విదేశీ ప్రతినిధులకూ, కొన్ని వందల మంది భారత ప్రతినిధులకూ వసతి చేకూర్చడానికి సిద్ధ పరచబడింది. మందిరానికి పడమర భాగంలో అయిదు వరసల్లో వున్న మూడంతస్తుల భవనాల వెనుకవున్న విశాలమైన ఖాళీస్థలంలో వందలాది గుడారాలనూ, షామియానాలనూ, సమ్మేళనంలో పాల్గొనే వివిధ రాష్ట్రాల ప్రతినిధులకోసం నిర్మించారు. దాదాపు యాభై వాటాలున్న వర్తులాకారంగల నాలుగంతస్థుల భవంతి, పది విశాలమైన షెడ్లను క్రొత్తగా నిర్మించారు. కొంచెమించుమించులో గుట్టలమధ్య వున్న సుమారు నూరు ఎకరాలు విస్తీర్ణంగల స్థలం వివిధ వసతి సదుపాయాలతో, నీరు, మురుగు పారుదల సౌలభ్యాలతో, రహదారులతో, విద్యుచ్ఛక్తితో ప్రతినిధుల, భక్తుల నివాసార్థం తయారు చేయబడింది. స్వామి సందేశం ప్రపంచంలో వివిధ దేశీయులు మాట్లాడే ముఖ్యభాషల్లో (భారతీయ భాషలుకాక)అనేక బోర్డులపై వ్రాయబడింది మొత్తం ప్రదేశమంతా రంగురంగుల పతాకాలతో, మామిడాకుల తోరణాలతో వివిధరకములైన ఆకర్షణీయమైన అలంకరణలతో ఉత్సవరూపం సంతరించుకొన్నది. ఇవన్నీ స్వామి స్వయం పర్యవేక్షణలో జరుపబడ్డంతో మరింతగ శోభను చేకూర్చుకొన్నాయి.

దీనికి తగ్గట్టు పుట్టపర్తికి చుట్టుపట్లగల నూరు గ్రామాలు శ్రీ సత్యసాయి తాలూకా పేరుతో కొత్త తాలూకాగా రూపొందినాయి. స్వామి జన్మదినోత్సవ వేడుకలు ఈ గ్రామస్తులకు సంతోషం, ప్రేమను అందజేసే క్రొత్తయుగాన్నిచ్చాయి.

నవంబరు 13వ తేదీన వివిధ భారతీయ వార్తాపత్రికలకు, వార్తాసంస్థలకు చెందిన విశేష ప్రతినిధులూ, వార్తాహరులూ ప్రశాంతినిలయం సందర్శించి, నిశ్శబ్దంగా రూపొందుతున్న ఈ ఆధ్యాత్మిక విప్లవాన్ని, దానికి సంబంధించిన వివిధ రూపాలను తెలుసుకోగలిగారు. వారు మూడవ ప్రపంచసమ్మేళనం గురించి. దానిలో ఉద్భవించే విశేషాలను గురించి ముచ్చటించారు. ఆ బృందం ప్రశాంతి మందిరం దర్శించినపుడు స్వామి తమ అమృత వాక్యాలతో వారినాశీర్వదించారు. చాలా పత్రికలు సమ్మేళనపు ముఖ్య లక్ష్యానికి ప్రాముఖ్యాన్నిస్తూ, ప్రస్తుత పరిస్థితిలో మానవాళి నెదుర్కొంటున్న ముఖ్య సమస్యలనెత్తిచూపటానికే అవకాశం వినియోగించాయి. ఆ పత్రికలు సాయి అవతారంలో గల ప్రత్యేకతను వివరిస్తూ. సత్యసాయి సంస్థలచే నడుపబడుతున్న విద్యా సంస్థలలో ఆచరణలో పెడుతున్న సత్యసాయి విద్యావిధానపు ఆశయాలను ప్రకటించాయి. ప్రేమతత్వమే ఆధారంగా వివిధ ప్రదేశాల్లో శ్రీ సత్యసాయి సేవాసంస్థలు చేపట్టిన సాంఘిక సేవా కార్యక్రమాల గురించి కూడా సవివరంగా వ్రాశాయి.

ఎన్నోరోజులు ముందుగా ప్రశాంతినిలయం చేరి భజనల్లో పాల్గొంటూ వేలాదిమంది స్వామి దర్శనం కోసం వేగిరపడసాగారు. సమ్మేళనం నిర్వాహక సమితులకి చెందిన వివిధ సభ్యులూ ప్రతినిధుల కాతిథ్యంకోసం జరుపుతున్న ఏర్పాట్లను చర్చించడంకోసం, తుదిమెరుగులు దిద్దడంకోసం నవంబరు 12న సమావేశమయ్యారు. ప్రశాంతినిలయం చేరిన ప్రతినిధులకూ, భక్తులకూ కావలసిన సదుపాయాలు చేకూర్చడంలో బృందావనం, పుట్టపర్తిలలో గల కళాశాల విద్యార్థులూ, అనంతపురం కళాశాల విద్యార్థినుల

ఉత్సాహం ముఖ్యపాత్ర హృదయాన్ని రంజింప చేశాయి. ఎట్లాంటి పనినయినా హృదయపూర్వకంగా నిర్వహించడానికి సంసిద్ధతను వ్యక్తం చేసేరీతిగా మలచబడ్డ సేవాదళ్ సభ్యుల బృందాలు దేశం నలు మూలలనుండి ప్రశాంతినిలయం చేరాయి. నవంబరు 15న వారికి భగవాన్ బాడ్జీల నందచేసి గుర్తింపు నిచ్చారు. తద్వారా తమ విధులను, భక్తి ప్రపత్తులనూ, క్రమశిక్షణనూ వారికి గుర్తుచేశారు. కేంద్రప్రభుత్వపు రైల్వేశాఖ సమ్మేళనానికి వచ్చే ప్రతినిధులకి ప్రయాణ ఖర్చులో రాయితీ సదుపాయం కల్గించింది. ఆంధ్ర ప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాల రవాణాసంస్థలు అనేక బస్సులను పుట్టపర్తికి నడిపాయి. రైళ్ళల్లో, బస్సుల్లో వచ్చే ప్రతినిధులకూ, భక్తులకూ, హైదరాబాద్, గుంట కల్, ధర్మవరం, పెనుకొండ, బాగేపల్లి గ్రామాల్లో విశ్రాంతి ఆహార సదుపాయాలను సాయి కుటుంబ సభ్యులు ఉత్సాహంతో అందచేశారు. బెంగుళూరులో మార్గదర్శకత్వం, ప్రయాణ సదుపాయాలు కలుగ జేశారు.

నవంబరు 17వ తేది విదేశీ భక్తుల్లో బాగా భజన పాడేవారు భజనలో పాటలు పాడడంతో కార్యక్రమాలు మొదలయ్యాయి. పూర్ణచంద్ర సభామంటప వేదికపై భగవాన్ ప్రత్యక్ష సన్నిధిలో పాడే ఆనందదాయకమైన ప్రత్యేకావకాశం వారికి లభింపచేయడంతో వారంతా అత్యంత ఆనందంతో గానం చేశారు. జపాన్, మెక్సికో, అమెరికా, మలేసియా, శ్రీలంక, దక్షిణాఫ్రికా మొదలైన వివిధ దేశాలనుండి వచ్చిన గాయకులు పాటలు పాడారు. తియ్యని గానం, ఎనలేని భక్తి ప్రపత్తులతో ఆ గాయకులు భజనలు పాడుతుంటే సభా మంటపం యావత్తూ ఒక దివ్యానందంలో మునిగి పోయింది.

నవంబరు 18న పుట్టపర్తి గ్రామాధి దేవతల ఉత్స వము కన్నుల పండుపుగా జరుపబడింది. గ్రామంలో గల వివిధ ఆలయాలకి సంబంధించిన దేవతా విగ్ర హాలూ ప్రశాంతి మందిరములో వేదవిహిత కర్మ లతో పునరుజ్జీవింప చేయబడి రథారోహణం చేశాయి. భగవాన్ స్వయంగా రథందగ్గర నిలబడగా వేలాది మంది భక్తులు రథోత్సవంలో పాల్గొన్నారు. అసం ఖ్యాక ప్రజానీకం, జాతి, మత, కుల, వర్గ వైషమ్యాలు లేక ఏకజాతిగా ఆ ఉత్సవములో పాల్గొన్నారు. డప్పులమోత, కొమ్ముావాద్యాల ఘోష, వివిధ సంగీత వాద్యాల సందోహంతో గ్రామస్తులూ, భక్తులూ రథాన్ని గ్రామానికి లాక్కుంటూ పోయారు. ఆ సాయంత్రం "శివశక్తి" అనే నృత్యనాటకము ప్రదర్శింపబడినది. హిమాచలప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, గుజరాత్, తమిళ నాడు, కేరళ మొదలైన వివిధ రాష్ట్రాలకి చెందిన బాలవికాస్ పిల్లలు జానపద నృత్యాలను భగవాన్ దివ్య సన్నిధిలో ప్రదర్శించారు. ఆ నృత్యాలలో సరళ మైన జానపద, గ్రామరీతుల్లో సాయి అవతార ప్రాము ఖ్యాన్ని, ప్రాముఖ్యాన్ని కన్నులవిందుగా కమనీయంగా ఆ చిన్నారి పాపలు ప్రదర్శించారు. అదే రోజున శ్రీ పి. ఆనందకుమార్ అనే బొంబాయి గాయకుడు అద్భుత గానంతో ఇసుకవేస్తే రాలని క్రిక్కిరిసిన సభా మంటప ప్రేక్షకులను ముగ్ధులను చేశారు.

నవంబర్ 19వ తేది ఉదయం సుమారు పన్నెండు వేలమంది వివిధ దేశాల, ప్రదేశాల ప్రతినిధులు — స్త్రీలు గౌరవర్ణపు చీరల్లో, పురుషులు తెల్లటి దుస్తుల్లో భజనలు పాడుకుంటూ శ్రీ సత్యసాయి విద్యాగిరి దక్షిణ మహాద్వారం వద్దనుండి బారులుతీరి సభాస్థలికి బయలుదేరారు. భగవాన్ శ్రీ సత్యసాయిబాబు తెల్లని దుస్తులు ధరించిన ప్రతినిధుల మధ్య పాలసము ద్రంలోవున్న శ్రీమహావిష్ణువును గుర్తుకుతెచ్చారు. ప్రతి

విధులు పూర్ణచంద్ర సభామంటపంచేరేవరకు బాబావారు ప్రతినిధుల మధ్యలోనే వున్నారు. ప్రతినిధుల సమూహం శ్రీ సత్యసాయి విద్యార్థి వసతిగృహం, శ్రీమతి ఈశ్వరమ్మ ఉన్నతపాఠశాల, శ్రీసత్యసాయి కళాశాల, శ్రీసత్యసాయి ప్రాథమిక పాఠశాలల ప్రక్కగా విద్యాగిరి ఉత్తరద్వారం దాటుకొని గోపురంద్వారా అత్యంత క్రమశిక్షణతో, మహోత్సాహంతో పూర్ణచంద్ర మంటపం చేరింది. బెంగుళూరునుండి వచ్చిన వాద్యబృందం సమూహానికి ముందర నడుస్తూండగా, హుబ్లినుండి, కొచ్చిన్‌నుండి వచ్చిన వాయిద్యకళాకారులు సమూహం మధ్యలో నడిచారు. పండితులు వేదాలను వల్లిస్తుంటే, భగవాన్‌నుచుట్టు నడుస్తున్న బృందావన కళాశాల విద్యార్థులు పురుషసూక్తం, నారాయణ ఉపనిషత్తు, మొదలైన శ్రుతులను పఠించారు. ప్రతినిధుల సమూహం దాదాపు పదిగంటల ప్రాంతానికి పూర్ణచంద్ర సభాస్థలికి చేరింది. పూర్ణచంద్ర సభామంటపం సభ్యులతో క్రిక్కిరిసిపోయింది. వేలాదిమంది సభాస్థలికావల నెలకొల్పిన టెలివిజన్‌లముందు స్వామిదర్శనార్థం గుమిగూడారు.

తమ అపరిమిత అనుగ్రహం ఎల్లెడలా ప్రసరింపచేస్తూ, నిశ్శబ్దంగా నివాళులర్పించుతున్న అశేషమాన వాళి కన్నులకు విందునందిస్తూ, స్వామి ప్రేమజ్యోతిని, సమ్మేళన ప్రారంభచిహ్నంగా వెలిగించారు. డా. వినాయకకృష్ణ గోకాక్‌గారు అతిథులకు, ప్రతినిధులకు, భక్తులకు, స్వాగతంపలికారు. వారు హృదయాలను కదించే తమ ఉపన్యాసంలో స్వామివారి అనుగ్రహ ఆశీర్వాదాలతో ప్రస్తుతం సాగుతున్న ఆధ్యాత్మిక విప్లవం యావత్తు మానవాళిని సంరక్షిస్తున్నదనటంలో ఎట్టి అనుమానానికీ ఆస్కారం లేదని ఉద్ఘాటించారు. శ్రీఇందూలాల్‌షాగారు సమ్మేళనం మొదటిరోజు కార్యక్రమంలో "సాయిమార్గం" అనే శీర్షికగల విద్వత్సదస్సు ఉంటుందని తెలిపారు.

భగవాన్ తమదివ్య హస్తములతో ఇంగ్లీషు, జర్మన్, జపనీస్, చైనీస్, గుజరాతీ, హిందీ, కన్నడ, మళయాళం, ఒరియా, అస్సామిస్ భాషల్లో వివిధ రచయితలు రచించిన, అనువదించిన గ్రంథాలను ఆవిష్కరించారు. వివిధరంగాల్లో ప్రముఖులయిన వ్యక్తులు అర్పించిన వ్యాసమాలికలతో కూర్చిన ఆంగ్ల పుస్తకం "గోల్డెన్ ఏజ్ 1980"ని. స్వామి ఆవిష్కరించి వ్యాస రచయితలకు తమ అమృతహస్తాలతో అందచేసారు. తదుపరి శ్రీరూపక్‌చంగక్‌కోటి, శ్రీమతి పి. సుశీల గార్లు శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థుల సహకార గానంతో పాడిన స్వామిజీవితచరిత్ర రికార్డు "సాయి కథను" భగవాన్ విడుదలచేశారు. ఈ జీవితచరిత్ర రచియిత శ్రీ ఆదినారాయణ రావు, సంగీతదర్శకుడు శ్రీ రాజేశ్వరరావు గార్లకు, గాయకులకు స్వామి తమ దివ్యహస్తములతో రికార్డులను బహూకరించారు.

భగవాన్ బాబావారు తమదివ్యోపన్యాసంతో సదస్యులనాశీర్వదించారు. ఆత్మగురించి ప్రతి వ్యక్తి గుర్తించవలసిన అవసరాన్ని తెలియచేస్తూ, బహుత్వమను మిథ్యలో మానవాళిని కొట్టుకునేట్లు చేస్తున్న నిజమైన ఏకత్వాన్ని గుర్తించేట్లు చేయవలసిందిగా ప్రబోధించారు. పట్టువదలని సాధనతో హృదయంలో ప్రేమ పుష్పాన్ని వికసింపచేసుకోవడంద్వారా ఈ ఏకత్వాన్ని గుర్తించడానికి వీలవుతుందని తెలిపారు. భారతదేశంలో సనాతన ధర్మం శాంతినీ, ధైర్యసాహసాలనూ, ఆధ్యాత్మిక మార్గంలో ప్రగతిని సాధించడానికి వివిధ సాధనలను ఎట్లా నెలకొల్పిందో విశదీకరించారు.

తదనంతరం జరిగిన విద్వత్సదస్సులో పాల్గొన్న

డా. జాన్ హిస్లాప్ సాయిమార్గం అనుసరిస్తున్నసాధకు డిలోవుండాల్సిన విశేషలక్షణాలను గురించి సులభ శైలిలో విశదీకరించారు. సాయిభక్తుల అధ్యయన కేంద్రాలు అవలంబింపవలసిన పద్ధతులనూ, మార్గాలనూ తద్వారా సాధించవలసిన లక్షణాలను, అందుకోవలసిన ఆధ్యాత్మిక ప్రగతినిగూర్చి తెలియచెప్పారు. ఉస్మాని యావిశ్వవిద్యాలయంలో ఆచార్యులయిన డాక్టర్. బషీరుద్దీన్ భగవాన్ ప్రబోధలను అధ్యయనం చేయడం ద్వారా తమకున్న చాలా సందేహాలు తొలగిపోయి కొరాన్ మతగ్రంథంలో నమ్మకం మరింతగా పెరిగిందనీ, స్వామి వాక్యాలను తు చ తప్పకుండా పాటించడంద్వారా మంచి మహమ్మదీయునిగా తయారవ్వగల నన్న నమ్మకం తనకు కల్గిందనీ వక్కాణించారు. డా. సూరి భగవంతం ఆధ్యాత్మికం లేనిదే విజ్ఞానం శూన్యమనీ, ఆధ్యాత్మికంకూడా విజ్ఞానం పెంపొందడానికి తోడ్పడుతుందనీ నిత్యజీవితంలో ఆధ్యాత్మిక జ్ఞానం, అనుభవం విడదీయరాని సంబంధం కలిగివున్నాయని నొక్కి చెప్పారు. సియర్రాలియోన్ దేశస్థులూ, ప్రస్తుతం లండన్‌నివాసి అయిన శ్రీ విక్టర్‌కానూ శ్రీ సత్యసాయి సేవాసంస్థలు ఆధ్యాత్మిక పునరుజ్జీవనం కంటే, ఆధ్యాత్మిక విప్లవం తీసుకొనివస్తున్నాయని చెప్పడమే సముచితమనీ, అదేచాలా ముఖ్యమైనదనీ తెలియచేశారు. "ఈ విప్లవం వేలాదిమంది ఆఫ్రికా వాసుల జీవితాల్లో ఎన్నటికీచెరగని మార్పుకలిగించిందని'' ప్రకటించారు. అమెరికాలో వాషింగ్టన్ బాప్టిస్టు చర్చికి సంబంధించిన రెవరెండ్ రాబర్టు పైప్సు సాయి భక్తుల్లో అగుపడాల్సిన ఆలోచనాసరళిని, భావాలనూ, నడవడికనూ, చేపట్టవలసిన కార్యక్రమాన్ని వివరించారు.

తొంభైయవ పడిలోవున్న టస్టిన్. కాలిఫోర్నియా (అమెరికా) కు చెందిన భక్తురాలు, సాయి భక్తులందర్కీ ప్రియమైన శ్రీమతి ఎల్సీకోవాన్ తర్వాత ప్రసంగించారు. శ్రీమతి కోవాన్ భగవాన్ బాబావారి యెడ పూర్తి భక్తి ప్రపత్తులు కలిగివుండటాన్ని, దైవమే మానవాళిని రక్షించడానికే స్వామి అవతారం దాల్చి వచ్చిందని, తెల్పినవిధంలో కనపరిచారు. తదుపరి మలేషియా నివాసి శ్రీ జగదీశన్ మాట్లాడుతూ ప్రపంచమంతా సాయిసందేశం సంచరిస్తూ అశేషమానవాళి జీవితాలను ప్రభావితం చేస్తోందన్నారు. ఇంకా భౌతికంగా, నైతికంగా,ఆధ్యాత్మికంగా దిగజారిపోతున్న ప్రస్తుతప్రపంచ పరిస్థితికి భగవాన్‌బాబా వారు మాత్రమే ఆశాకిరణంగా గోచరిస్తున్నారని వక్కాణించారు.

విద్వత్సదస్సులో అన్నిటికంటె మానసోల్లాసం కలిగించే విషయం మరొక్కటివున్నది. భగవాన్ నెలకొల్పిన కళాశాలలనుండి వుత్తీర్ణులైన విద్యార్థులు ఉపన్యాసాలిచ్చిన ఇతర పెద్దలతో సరిసమానమైన జ్ఞానంతోనూ, లోతైన భక్తితోనూ స్వామిసందేశాన్ని చాటిచెప్పే దూతల్లాగా సభాసదులందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తుతూ ప్రసంగాలుచేశారు. శ్రీ నిత్యానంద మీనన్ ఎం. కాం., ఎం. ఫిల్. విజ్ఞానం, ఆధ్యాత్మికం ఒకదానితో మరొకటి స్పర్ధలేకుండా పరస్పరం ఎట్లా తోడ్పడి మానవాళివున్నతికి సహకరించగలవో విశ్లేషించారు. శ్రీ అనూప్ రులానీ ఎం. కాం. సాయి మార్గదర్శకత్వంలో, నేతృత్వంలో వ్యక్తీకరింపబడుతున్న ఆధ్యాత్మిక విప్లవ రూపాన్ని విశదీకరించారు. శ్రీ కమల్ సహానీ ఎం. కాం. స్వామి ఎడల కల్గి వుండాల్సిన భక్తిలో హృదయం, కర్మ, బుద్ధి ఎలా సమ్మిళితం చేయాలో వివరించారు. శ్రీ పి. శ్రీనివాస్ ఎం. కాం., ఎం. ఫిల్. భగవానుల విశ్వవ్యాపకత్వం తెలియపరచడానికి కొన్ని సంఘటనలను తెలుపుతూ, యావత్ప్రపంచాన్ని రక్షించగల ఏకైక శక్తి శ్రీ సత్యసాయి మాత్రమే అని వక్కాణించారు.

విద్వత్సదస్సు ముగిసిన పిదప సమ్మేళన సభ్యులు ప్రముఖ వయొలిన్ విద్వాంసులు శ్రీ వి. జి. జోగ్‌గారు వీనుల విందుగా వయొలిన్ కచ్చేరి చేయగా ముగ్ధులై విన్నారు. శ్రోతలను తమగాన మాధుర్యంద్వారా ఆకట్టుకున్నారు, శ్రీ హరిప్రసాద్ చౌరసియా.

నవంబరు 20వ తేది సంస్థల కార్యక్రమ విశేషాలకి కేటాయించబడింది. ప్రతినిధులు తమతమ రాష్ట్రాలు వేళాలవారీగా విడివిడిగా కూర్చొని మార్గదర్శక సూత్రాలగురించి, సంస్థల అభివృద్ధి గురించి. సంస్థల రూపాలలో మార్పులు తేవడం గురించి చర్చించారు. ఈ మార్పులవల్ల వ్యక్తిపరంగా సమాజపరంగా ఆధ్యాత్మికోన్నతి ఎట్లాసాధించాలన్నది కూడా చర్చింపబడింది. వివిధ సంస్థల కార్యకలాపాలలో వచ్చే అడ్డంకులు లేదా ఒకే కార్యం రెండు ఉపసంస్థలు చేయడం లాంటి విషయాలను, సేవాకార్యక్రమాలను గ్రామప్రాంతాలో వున్న శ్రామిక జనోద్ధరణకు వ్యాపింపజేయటం, బాలవికాస్ విద్యాసంస్థల నిర్వహణ, సేవాదళ్ సభ్యులకు బాలవికాస్ గురువులకు ఆరోగ్యవిద్యలో శిక్షణ గరపటం, మానవ విలువలగూర్చి క్రొత్తపథకాల ద్వారా విద్యనందించటం సేవాసంస్థలలోగల సమితి, మహిళావిభాగ్, సేవాదళ కార్యక్రమాల మధ్య సయోధ్యసమన్వయం, గూర్చి ప్రతినిధులు చర్చలుజరిపి సలహాలను రూపొందించారు. అంతేకాక ప్రతిరాష్ట్రంలోనూగల సేవాసంస్థల నిర్వాహకులకూ, సత్యసాయిట్రస్టు నిర్వాహకులకూ మధ్య వుండవలసిన అవగాహన గూర్చికూడా కొన్ని సలహాల నందించారు.

ఆరోజు సాయంత్రం డా॥ గోకాక్‌గారు సదస్యుల నుద్దేశించి మాట్లాడుతూ ప్రస్తుత విద్యా వ్యవస్థను శోధనంచేసి క్రొత్తరూపం ఇవ్వాలసిన అవసరాన్ని గూర్చి నొక్కిచెప్పారు. భగవాన్ బాబావారిని విశ్వనేతగానూ, ప్రపంచంలో జనావళికోసం జన్మించిన పరమగురువుగా వర్ణించిన విధానం శ్రోతల హృదయాల నాకట్టుకుని ప్రతినిధులనందర్నీ సాయి ఆశయాలు సఫలీకృతం చేయటానికి కంకణం కట్టుకొని సర్వ సమర్పణకు సంసిద్ధం చేసేట్లు తోడ్పడింది. తదనంతరం పండిట్ శివకుమార్ శర్మ తన సంతూర్ వాదనంతో సభికులనందర్నీ ఆహ్లాదపరిచారు. శ్రీమతి మీనూ పురుషోత్తం, శ్రీ మహేంద్రకపూర్ గార్లు, ప్రఖ్యాత సినీ దర్శకులూ, నటుడు శ్రీ మనోజ్‌కుమార్ కూర్చిన భక్తిగీతాల గానంతో ప్రేక్షకులను తన్మయులను గావించారు.

నవంబరు 21వ తేది వివిధ రాష్ట్రాల అధ్యక్షులు సమ్మేళన సదస్సులకు తమ తమ నివేదికలను సమర్పించారు. ప్రతినిధులను తమ అభిప్రాయాలను వెలిబుచ్చవలసినదిగా కోరారు. అమెరికా దేశస్థులూ స్వామి సందేశాలను విశేషరీతుల్లో అందుకొనుచున్న శ్రీ చార్లెస్‌పెన్, అమెరికాలో ఓహాయి నగరంలో ప్రపంచ విశ్వవిద్యాలయ సంస్థాపకులు శ్రీ చెన్నైటో రేప్. స్వీడన్ దేశస్థులు శ్రీ కుర్తి గారలు సభికుల నుద్దేశించి ప్రసంగిస్తూ తమ విచిత్రమైన పవిత్రానుభవాలను వివరించారు. మధ్యాహ్నం జరిగిన సమ్మేళనం ఆఖరుభాగంలో శ్రీ ఇందులాల్‌షా గారు సమ్మేళనం తీసుకున్న నిర్ణయాలను సభకు చదివి వినిపించారు. బాలవికాస్‌నూ, అధ్యయన కేంద్రాలనూ, సాధనా కార్యక్రమాలనూ, ఆరోగ్య పథకాలనూ విస్తృత పరచి గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను పునృతం చేయాలని తెలిపారు.

భగవాన్ బాబావారు సమ్మేళన సమాప్తి సందర్భములో దివ్యోపన్యాసం ఇస్తూ, ప్రతినిధులను ఆడంబరం, స్వార్థం విడచిపెట్టి తమ సోదర మానవాళి

కష్టనిష్ఠూరాలను తీర్చడానికి కంకణం కట్టుకోవాలని ఉద్బోధించారు. ఎన్నడూ ఏదీకోరని స్వామి ప్రతి నిధులను ఒక కోరిక కోరుతూ. ప్రతి కుటుంబం ప్రతి దినం ఒక అన్నార్తుణ్ణి ఆదరించాలని వక్కాణిస్తూ తద్వారా దేశంలో అన్నంకోసం అలమటించవలసిన వారు లేకుండా చెయ్యాలని నిర్దేశించారు. సంస్థ సభ్యులు తమ కార్యక్రమాలను నియమనిబంధనలకను గుణంగా మలచుకోవాలని ఆదేశిస్తూ నిత్యసత్యమైన ఆత్మ గురించి ఎల్లప్పుడు ధ్యానతో వుండవలసిందిగా ప్రతినిధులందరికీ తెలిపారు. అదే సర్వులనూ ఏకం చెయ్యడానికి మార్గమని తెలియచెప్పారు.

తదుపరి స్వామి భక్తురాంద్రు ప్రఖ్యాత గాయనీ మణులు శ్రీమతులు రాధా. జయలక్ష్మి పాడిన భక్తి గీతాల రికార్డును భగవాన్ కరుణతో విడుదల చేశారు. శ్రీమతులు రధా. జయలక్ష్మి గార్లు కొన్ని భక్తి గీతా లు పాడి సభ్యులను ఆనందపరిచారు.

నవంబరు యిరవై రెండవ తేది "కింగ్‌డం ఆఫ్ సత్యసాయి" వార్షికోత్సవదినం (బృందావనం శ్రీ సత్యసాయి కళాశాలలో చదువుతున్న పాత విద్యార్థులు నెలకొల్పుకొన్న సంఘం) సంఘ సభ్యులందరూ బారులుతీరి ప్రశాంతి మందిరంనుండి పూర్ణచంద్ర సభామంటపం చేరుకొని తమ సంరక్షకుడు శ్రీ సత్య సాయి భగవానులకు అంజలి సమర్పించారు ఆనాడు సభావేదిక అలంకరించిన తీరు చూడవలసినదేగాని వర్ణించుటకు మాటలు చాలవు. శ్రీ నిత్యానంద మీనన్ (అధ్యక్షులు), శ్రీ పి. శ్రీనివాస్ (కార్యదర్శి), శ్రీ కమల్‌సహానీ తమ విద్యార్థులపట్ల స్వామి చూపే అను రాగాన్నీ, జాగ్రత్తనూ వివరిస్తూ తమ జీవితాల్లో ప్రతి క్షణాన్ని భగవాన్ కాపాడుతున్నారని తెలియచేశారు. ప్రతిసంవత్సరం కళాశాలనుండి వుత్తీర్ణుడైన అత్యు త్తమ విద్యార్థికిచ్చే రు॥ 1,116 బహుమతిని స్వామి శ్రీ అమిత్‌సింగ్ అనే విద్యార్థికి అందచేశారు. ఆ సందర్భంగా శ్రీ అమిత్‌సింగ్ తాను బాలవికాస్ విద్యార్థిగా ఢిల్లీలో పొందిన అనుభవాలనూ, బృందా వనంలో కళాశాల విద్యార్థిగా పవిత్రమైన స్వామి సన్ని ధిలో పొందిన ఆదరణనూ, కళాశాలలోనూ. వసతి గృహంలోనూ లభించిన అవకాశాలనూ వివరించారు. శ్రీ సత్యసాయి కళాశాలల్లో అత్యుత్తమ విద్యార్థులుగా పరిణతినొందిన శ్రీ శివశంకర్ సాయి (బృందావనం) కుమారి రష్మినాగ్ (జైపూర్) తర్వీదర్ కౌల్ (భోపాల్) ఊర్మిళా సూర్యవంశి (అనంతపురం) లకు భగవాన్ బంగారు పతకాలను ప్రదానం చేశారు. శ్రీ బాబావారు శ్రీ సత్యసాయి కళాశాలల ప్రిన్సిపాలు లకు, బంగారు పెన్నులనిచ్చి, తమ అనుగ్రహవర్షం కురిపించారు.

బహుమతి ప్రదానం తరువాత స్వామి విద్యార్థుల నుద్దేశించి మాట్లాడుతూ యువతరం మాతృభూమికి హృదయపూర్వకంగా సేవ చేయాలనీ, దానికవసర మైనరీతిగా వారు తయారవ్వాలని ప్రబోధించారు. వారు తమ దివ్యోపన్యాసంలో ప్రస్తుతం నెలకొనివున్న ధన వాంఛనూ దానికోసమై విదేశాలకు వలసపోతున్న విద్యాధికులనూ గర్హించారు. తమ దుస్తుల్లో. అలం కరణల్లో అనుకరణను మాని సోదర మానవులతో సుహృద్భావం పెంపొందించుకోవలసినదిగా ఉద్బోధిం చారు ఎల్లరిలోవున్న భగవంతుణ్ణి దర్శించడానికి సేవా సాధనను యువజనం చేపట్టాలని స్వామి ఉద్ఘా టించారు.

ఆ సాయంత్రం విశ్వవిఖ్యాత సితార్ వాదకులు పండిట్ రవిశంకర్, తబలా వాద్యకారులు శ్రీ అల్లా రఖా భక్తుల హృదయానందకరంగా సంగీత సాధన

చేశారు. తదనంతరం శ్రీ సత్యసాయి సామ్రాజ్య సభ్యులు "స్వర్గ సామ్రాజ్యం" (కింగ్‌డమ్ ఆఫ్ హెవెన్) అనే ఏసుక్రీస్తు జీవితచరిత్రను నాటక రూపంలో ప్రదర్శించారు. శ్రీ రూపక్ చంగ్‌కకోటి ఏసుగా ప్రేక్షకుల హృదయాలను చూరగొన్నారు. నాటక ప్రదర్శనలో సంగీతం, దీపాలంకరణ, ఇతర నాటక సాధనలు ప్రతివ్యక్తినీ సంభ్రమాశ్చర్యాలలో ముంచి, ప్రేక్షక హృదయాలలో చెరగని ముద్ర వేసాయి. శ్రీ క్రిష్టఫర్ సెయింట్ జాన్ అనే ప్రఖ్యాత హాలీవుడ్ చిత్రదర్శకుడూ, నటుడూ అందచేసిన కొన్ని సూచనలు నాటక ప్రదర్శన రక్తి కట్టించడంలో తోడ్పడ్డాయి.

నవంబరు 23వ తేది ముఖ్యాతిముఖ్యమైన రోజు, లక్షలాదిమంది భక్తులు భగవంతుడు మానవరూపం ధరించి తమ మధ్య నివసించడానికి వచ్చిన సందర్భంలో తమ కృతజ్ఞతాంజలి సమర్పించుకోవడంకోసం ఎదురుచూసే రోజు. ప్రశాంతినిలయ ఆవరణం ప్రపంచంలోని ప్రతి మూలనుండి వచ్చిన వివిధ జాతుల, వర్ణాల ప్రజలతో క్రిక్కిరిసిపోయింది. ఆ రోజు స్వామి ఉదయ కిరణాలు పూర్వాద్రినుండి వెలువడుతున్న సమయంలోనే దర్శనమిచ్చారు. అనంతరం తమ దేహానికి జన్మనిచ్చి లోకవంద్యులయిన మాతాపితరుల సమాధి మందిరమునకు భక్తబృందసమేతంగా తరలి వెళ్ళారు. అటునుండి నూరు పడకలకనువుగా నిర్మింపబడబోయే ఆస్పత్రి భవనానికి తమ దివ్యహస్తములతో శంఖుస్థాపన గావించారు.

ప్రశాంతి మందిరంనుండి పూర్ణచంద్ర సభామంటపంవరకు భక్తులచే పూరేకులతో తివాచీగా అమర్చిన బాటపై పండితులు వేదపఠనం గావిస్తుండగా, సత్యసాయి సంస్థల విశ్వసమితి సభ్యులు అనుసరింపగా, ధర్మజుడొనరించిన రాజసూయం సందర్భంలో శ్రీకృష్ణ భగవానుని తలపుకి తెస్తూ, సభాస్థలికేతెంచారు సత్యసాయి భగవానులు. శ్రీవారి దర్శనం చేసుకొన్న బారుఋతీరిన భక్తుల హృదయాల ఆనందం వర్ణనాతీతం. దాదాపు యాభై దేశాలనుండి ఏతెంచిన భక్తుల ప్రతినిధులనుండి స్వామి పుష్పమాలలను గ్రహించి అనుగ్రహించారు. ఆయా దేశాల ప్రతినిధుల పేర్లను డా. సూరి భగవంతం చదివారు. పెరూ, మెక్సికో, గ్వాటిమాలా, వెనిజులా, ట్రినిడాడ్, అమెరికా, కెనడా, ఐస్‌లాండ్, బ్రిటన్, స్వీడన్, జర్మనీ, స్పెయిన్, ఇటలీ, గ్రీస్, ఆఫ్రికాలో వివిధ దేశాలు, అరబ్ దేశాలు ఆస్ట్రేలియా, జపాన్, ఫిజీ, శ్రీలంక, న్యూజిలాండ్, మలేసియా, సింగపూర్, మారిషస్ మొదలైన దేశాల ప్రతినిధులు హారాలు సమర్పించిన వారిలో వున్నారు. శ్రీ సత్యసాయి సంస్థల విశ్వసమితి శ్రీ సత్యసాయి కేంద్ర ట్రస్టు సభ్యులనుండికూడా స్వామి పుష్పమాలలు స్వీకరించి అనుగ్రహించారు.

స్వామి భక్తులు మహారాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి, ప్రస్తుత కేంద్ర ప్రభుత్వ విద్యామంత్రి గౌ॥ శ్రీ ఎస్. బి. చవాన్ సభికుల నుద్దేశించి ప్రసంగిస్తూ జన్మదినోత్సవంనాడు భగవానులకంజలి సమర్పించడానికి సమావేశంలో పాల్గొన గలిగినందులకు వారిని అభినందించారు. భారతదేశంలో ప్రస్తుత విద్యావ్యవస్థలందున్న అసంఖ్యాకమైన లోపాల గురించి ప్రస్తావించి, సత్యసాయి విద్యాలయాలు ఏకీకృత విలువలే ప్రధానంగా కలిగిన విద్యావ్యవస్థ నెలకొల్పడంలో చేస్తున్న కృషిని ప్రశంసించారు. కర్ణాటక రాష్ట్ర గవర్నర్ శ్రీ గోవింద నారాయణ్, స్వామి ప్రేమనూ, కారుణ్యాన్ని వివరిస్తూ భగవాన్ సర్వవ్యాపకత్వమే ప్రపంచం నలుమూలలనుండీ సాధకులను ఈ ఉత్సవాలకి వచ్చేట్లు చేసిందని చెప్పారు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబు భక్తులకు జన్మదినోత్సవ సందేశం అనుగ్రహిస్తూ భక్తులందర్నీ ఒక కానుక సమర్పించమని కోరారు. "ఏమీకోరని భగవానుడు కోరిన కోర్కె: దురాశను దూరం చేసుకొని అసూయను ఆవలకునెట్టి, స్వార్థం త్యాగం చేయండి. మీరు సృష్టిలోని ప్రతి జీవికీ హృదయపూర్వకంగా సేవ చేయండి. అదే మీనుండి నేను కోరేకాన్క" అని భక్తుల నేత్రాలు బాష్పాలు వర్షించేట్లు చేసిన ఆదేశం భగవాన్ అనుగ్రహాశీర్వాదములతో సుమారు మూడు లక్షలమందికి స్వామి జన్మదినోత్సవ ప్రసాదం లడ్లు పంచ బడ్డాయి.

జన్మదినోత్సవ సాయంకాల కార్యక్రమంలో స్వామి భక్తురాలు, విశ్వవిఖ్యాత గాయనీమణి శ్రీమతి ఎం. ఎస్. సుబ్బలక్ష్మి తమ గాన మాధుర్యంతో సభ్యులను పరవశింప చేశారు. సాయి అవతారం మీద ఆమె కూర్చిన కీర్తనలు భక్తుల హృదయాలకు అమితానందం చేకూర్చాయి. తదుపరి పండిట్ భీమసేన్ జోషి (హిందూస్థానీ సంగీతంలో పేరుపొందిన గాయకుడు). అక్బరు చక్రవర్తి ఆస్థానగాయకుడు తాన్‌సేన్‌చే అజరామరం చేయబడ్డ దీపక్ రాగ్‌ను గానం చేసి సభ్యులను ముగ్దుల గావించారు.

తదనంతరం మీగడ తారకలాంటి తెల్లని స్వచ్ఛమైన దుస్తులు ధరించి లక్షలాది భక్త ప్రేక్షకులకు ఎనలేని ఆనందం, నేత్రపర్వం కావిస్తూ ఉయ్యాలోత్సవానికి అరుదెంచారు భగవానులు. ఆనంద స్వరూపులైన స్వామి హృదయానందం గావిస్తూ ఆ ఉయ్యాలలో పసివానిలా వూగుతుంటే లెక్కలేనన్ని భక్తుల మానసాలు ఉల్లాసంతో ఉబికుబుక సాగాయి. అట్లా బాబావారు భక్తుల కన్నులకానందం కలిగిస్తుంటే శ్రీమతి పి. సుశీల, శ్రీమతి పి. లీల, శ్రీరామకృష్ణ గారలు శ్రీవారి పూర్వావతారాన్ని "రామకథ"గా సభ్యులకు వీనుల విందు కలిగిస్తూ అత్యంత మాధుర్యంతో గానం చేశారు.

రామకథాగానం విన్న శ్రోతల హృదయాలు పరవశించి పోయాయి. రామకథ విని సభామంటపం ఈవలకు వచ్చిన పిదప దక్షిణ ప్రశాంతి భవనం మూడవ అంతస్థులపై జరిపిన బాణాసంచా కాల్పుల ప్రదర్శన భక్తులకు సంభ్రమాశ్చర్య సంతోషతప్తులను చేసింది.

నవంబరు 24 సాయంత్రం శ్రీ వి. ఆర్. కృష్ణ అయ్యర్, సుప్రీం కోర్టు న్యాయమూర్తి భగవానుల అవతార తత్వం గూర్చి సరళసుందర ఉపన్యాసమిచ్చారు. డా. వి. కె. గోకాక్ ఉరవకొండలో భగవాన్ బాబావారు యావత్తు మానవాళిని రక్షించ వలసిన తనకున్న బాధ్యత గురించి చేసిన ప్రకటన యొక్క అవున్నత్యాన్ని గూర్చి ప్రసంగించారు.

భగవాన్ బాబావారు తమ దివ్యోపన్యాసంలో మానవులను పుష్టి, మర్యాద, ప్రవాహ అనేమూడు తరహాలుగావర్గీకరించి, అన్నిటికంటే వున్నతమయిన స్థాయికి భక్తులు చేరుకోవలసిన అగత్యాన్ని గురించి ప్రబోధించారు. ప్రేమభావాన్ని విశాలం చేసుకోవలసిందని ఆదేశించారు. రాత్రి ఏడు గంటల ప్రాంతంనుండి కేరళలోని కొట్టెకల్ ఆయుర్వేద సంఘంవారి నాట్యకళా విభాగం వారు ప్రదర్శించిన రామాయణ కథాకళి ప్రదర్శనం భక్తులకు మానసోల్లాసం కలిగించింది. రాముడు అయోధ్య చేరి పట్టాభిషిక్తుడు కావడం. గతవారంరోజులుగా జరిగిన వివిధ సాంస్కృతిక ప్రదర్శనలకు సమాప్తి ప్రదర్శనంగా భాసించింది.

జన్మదినోత్సవ వారమంతా ఛాయాచిత్రాలు, వర్ణ చిత్రాల ప్రదర్శన భగవాన్ బాబావారిచే నవంబరు 18న ప్రారంభించబడి లక్షలాదిమందిచే దర్శించబడింది. శ్రీ సత్యసాయి సంస్థలచే ప్రపంచం నలుమూలలా చేపట్ట

బడిన సేవాకార్యక్రమములను. భగవాన్‌చే నెలకొల్ప బడిన వివిధ సంస్థల భవనములను దర్శకులు ఉత్సుకతతో దర్శించారు. భగవానుల సందేశం చిత్రాలలో చిహ్నాలలో వర్ణచిత్రాలలో మనోరంజకంగా చిత్రించ బడింది. భగవాన్ భక్తుల కోర్కెల మేరకూ వివిధ ప్రదేశాలకు జరిపిన పర్యటన చిత్రాలు అందంగా భాసిల్లాయి. భగవాన్ కాశ్మీర్ పర్యటనను కన్నులవిందు గావించే చిత్రాలు ముఖ్య ఆకర్షణ. ప్రదర్శనలో చాలా ఛాయా చిత్రాలు శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థులచే తీయబడి ప్రదర్శనలో అమర్చబడ్డాయి.

నవంబరు 25వ తేది ఉదయం శ్రీవారు పూర్ణచంద్ర సభామంటపంలో చేరిన విదేశాలనుండి ఏతెంచిన భక్తులందర్కీ తమ దివ్యహస్తములతో విభూతి పంచారు. అనిర్వచనీయమైన ఈ ప్రేమప్రవాహం ఆ భక్తులందర్కీ అవ్యాజమైన అనుభూతి నొసగి ఎల్లరినీ ఏకకంఠంతో స్వామికి ఆరతి పట్టి తమహృదయానందాన్నే కర్పూరంగా మార్చివేసింది. అచ్చట చేరిన ప్రతి వ్యక్తి హృదయస్పందనంలో సత్య, ధర్మ, శాంతి, ప్రేమలను తమ జీవన యాత్రలో భాగంగా చేసుకోవాలన్న విశ్వాసం కన్పడింది. ఆ రకంగా సత్యసాయి స్వర్ణయుగం ప్రతి దేశంలో నగరాలలో, గ్రామాలలో, ఇండ్లలో వెలుస్తుందనే భావన చూసిన ప్రతి ఒక్కరిలో కలిగింది.

ప్రపంచం నలుదిశలా కోట్లాదిమంది సాయి భక్తులందరూ సాయికుటుంబంగా మారారు. సాయి కుటుంబం వసుధైక కుటుంబంగా మారే రోజు ఎంతోదూరం లేదు. ప్రేమ, సేవాభావాలు మూలంగా కల్గిన సాయి సందేశం ప్రశాంతినిలయంనుండి సర్వవ్యాప్తమై ప్రతి భక్తుని హృదయంలో కొత్త ఆశను, ధైర్యాన్ని నెలకొల్పింది. సాయి అనే పరమ గురుని నేతృత్వంలో ప్రపంచ మానవాళి సుఖసంతోషాల కోసం పాటుపడేందుకు ప్రతి వారిని ఉత్తేజ పరిచింది. సేవాదళములు, బాలవికాస్‌లు, సత్యసాయి విద్యాసంస్థలు జగత్తంతా వ్యాపించి సర్వులు సాయి కుటుంబసభ్యులై సాయి స్వర్ణ యుగానికి యావత్తు భూవలయం ప్రశాంతినిలయంగా మారేరోజు ఆసన్నమయింది. ఆనందంతో, ఉత్సాహంతో సాగిపోతున్నారు.

సంపాదకుడు

(భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు మాడవప్రపంచ మహాసమ్మేళనములో మరియు జన్మదినోత్సవ సందర్భములో అనుగ్రహించిన దివ్యోపన్యాసములు వచ్చేసంచికలో ప్రచురితమగును.)

సం

# సతతం నమోస్తు

శ్రీమద్వేదవనీ విహార మనిశం చిద్రూప సంశోభితం
మాయాకారణ సృష్టిసంస్థితి లయవ్యాపార లీలారతం
యోగీంద్రామల మానసాంబుజ రవిం జ్ఞానేందిరా మందిరం
శ్రీమత్పర్తిపురీ ప్రశాంతినిలయం శ్రీసత్యసాయిం భజే

స్వాగతంబయ్య! శ్రీభగవాన్ మహాలాంఛనాంచిత విశ్వకళ్యాణమూర్తి
పాద్యంబు స్వీకరింపగదె! సత్యపదాంతరార్థ భూత జ్యోతిరనఘమూర్తి
అర్ఘ్యంబు గైకొనుమా! సాయి శబ్దవాచ్యావనీగత శేషశాయిమూర్తి
వేంచేయుమా! మణీవిష్టరంబందు 'బాబా' పదస్ఫుట జగద్బంధుమూర్తి
అఖిల భువనపక్షంబున నాంధ్రవాణి సతత సద్భక్తియుక్తి ప్రశాంతినిలయ
రమ్యసౌధంబునందు నీరాజనంబు పట్టుచున్నది యదె నీకు పరమపురుష

వందే సర్వశుభంకరం సురుచిరం వందే కృపాసాగరం
వందే బంధవిమోచనం భవహరం వందే త్రివేదాత్మకం
వందే సర్వసుఖావహం ధృతిమతిం వందే గురూణాం గురుం
వందే దివ్యమనంత మవ్యయమజం శ్రీసత్యసాయీశ్వరం

బాబా! నీయుదయంబు లోకమునకున్ భానూదయంబై యవి
ద్యాబంహిష్ఠసుషుప్తి (గూరిన జగచ్చక్రంబు కన్విప్పియా
శాబద్ధంబు తమంబుడుల్చి సుజన స్వాంతాబ్జముల్ ధర్మదీ
క్షాబోధంబున మేలుకొల్పె-శ్రుతి తేజఃపుంజమీవౌటచేన్

సత్యాయ సత్వసుగుణాయ సదాశ్రయాయ
సద్విగ్రహాయ సకలాగమ తత్పరాయ
సర్వాంగ సుందర తరాయ మనోహరాయ
శ్రీసత్యసాయి పతయే సతతం నమోస్తు

చూచునా, నా పైపు సురుచిరానందైక కరుణారసావేశ కమ్రదృష్టి
వినగూడునా, నాదువినుతి సంస్తోత్రముల్ సకలలోకేశ్వర సాయిమూర్తి
భాషించునా జగద్భూషణుండౌ స్వామి మందార మకరంద మధురసూక్తి
అనునయించునె నన్ను అభయప్రదాయక హస్తాంచలస్పర్శ హాయిగొలుప
పాపపంకిల నిర్మగ్నుభగ్ను నన్నుద్ధరించి వహించునే యిద్ధచరితు
డనుచు తలపోసియేతెంచు నార్తుజన్మసార్థకముఁజేయు సాయీశుసన్నుతింతు

లోకమువీదృగంచల విలోకమునన్ రహిఁజెందు. దిక్పతుల్
నీ కరుణాకటాక్షమున నిశ్చలతన్ మననెంత్రు దేవతా
నీకము నీమనోజ్ఞ కమనీయ మహాద్భుత రూపవైభవా
లోకము కై తపించు నిహలోలుర మేమొకపాటియే ప్రభూ!

జయము చిన్మయ సత్త్వమూర్తి
జయము బ్రహ్మజ్ఞానజ్యోతి!
జయము శ్రీమత్సత్యసాయి
జయము శుభదాయి!

మంగళం సాయిరామాయ
సచ్చిదానంద మూర్తయే
ఈశ్వరాంబా తనూజాయ
సత్యశీలాయ మంగళమ్!

శిష్టా సూర్యనారాయణ మూర్తి

# గమనిక

1980 అక్టోబర్ 1వ తేదినుండి సనాతన సారథి వార్షిక చందా రూ 6/-నుండి రూ 8/- పెంచబడింది. కాగితంధర ప్రచురణ తదితర ఖర్చులు పెరిగినందున ఈ పెంపుదల అనివార్యమైనది. సంవత్సరంకంటె ఎక్కువ కాలానికి చందా కట్టిన పక్షంలో అట్టి చందాదారులు చందాలో గల వ్యత్యాసపు మొత్తాన్ని శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతి నిలయమునకే పంపించవలసినదిగా కోరడమైనది. మొత్తమును పంపునపుడు మీ చందా నంబరును తప్పక తెలుపవలెను.

విదేశములోని చందాదారులు సంచిక ముందు పేజిలో ప్రచురింపబడిన ధరలననుసరించి తమ చందా పంపవలెను.

---

# పుస్తకములు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుతమూర్తి–(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం_అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | ఆత్మారామం | 5-00 | 0-45 |
| 3. | ఆధ్యాత్మికదీపిక | 2-50 | 0-20 |
| 4. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 5. | ధర్మవాహిని | 1-25 | 0-15 |
| 6. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 7. | ప్రశాంతివాహిని | 1-00 | 0-15 |
| 8. | ప్రేమవాహిని | 1-00 | 0-15 |
| 9. | మణిమాల | 2-00 | 0-20 |
| 10. | వచనామృతము (2) | 2-50 | 0-30 |
| 11. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-35 |
| 12. | సత్యం శివం సుందరం (2) | 7-00 | 0-35 |
| 13. | సత్యం శివం సుందరం(3) | 5-00 | 0-35 |
| 14. | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 15. | సూక్తిరసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 16. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 17. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 18. | సువర్ణసుమమాల | 5-00 | 0-30 |
| 19. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 20. | శ్రీ సత్యసాయివచనామృతము(3) | 2-00 | 0-20 |
| 21. | శ్రీ సత్యసాయిదివ్యబోధ | 2-00 | 0-20 |

---

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు_67, బృందావనములోని 'ప్రశాంతి బృందావన్ ప్రెస్' నందు పి. చంగళకోటిచే ముద్రింపబడి, యస్. కస్తూరిచే, "శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీసత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయము, తరపున ప్రచురింపబడినది. ఎడిటర్: యస్. కస్తూరి. సహాయ సంపాదకుడు వి. కె. నరసింహన్.

# సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయము,

## పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

(1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ చందాలు స్వీకరింపబడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 8 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 8 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 20 | 30 | 9 | 12 | | 12 |
| ఆఫ్రికా | 20 | 50 | 9 | 18 | | 18 |
| అమెరికా | 20 | 56 | 9 | 20 | | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 20 | 35 | 9 | 14 | | 14 |
| ఆస్ట్రేలియా | 20 | 60 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 20 | 30 | 9 | 12 | 9 | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 20 | 50 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 20 | 55 | 9 | 20 | | 20 |
| శ్రీలంక | 10 | 20 | 8 | 10 | | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏభాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రస్సు నందు మార్పు అవసరమని తెలుపు సమయము నందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిష్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిష్టర్డ్ ఛార్జి రూ. 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామాగల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయము, అనంతపురం జిల్లా ఆంధ్ర ప్రదేశ్-పిన్:515134, యొక్క చిరునామాకే పంపవలయును. మనియార్డర్ పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలయును.

---

(పుస్తకసూచి 272వ పుటలో చూడండి)

ప్రేమను మానవులు పొందుటకు ముఖ్యముగా గమనించ వలసిన విషయములు రెండున్నవి. అవియేవన ఒకటి: ఇతరులు చేయునట్టి పెద్ద తప్పయినను దానిని చిన్నదిగా భావించవలెను. వారికివారు చేయు చిన్న తప్పయినను పెద్దతప్పుగా భావించవలెను. ఇందు మూలమున మనము పెద్దతప్పులు చేయకుండుటకు అడ్డుగా నుండును. ఇతరుల తప్పులను పాటించక వారితో సమరసత్వము ఏర్పడును. మన సాధనకు కావలిపిన ఓర్పు, ప్రేమ ప్రాప్తించును. రెండవది: చాటున కాని బహిరంగముగా కాని నీవేమి చేసినను పరమాత్ముడు చూచుచున్నాడని తలంచుచు, నీవేది మాటాడినను పరమాత్ముడు వింటున్నాడని జాగరూకుడై, సత్యాసత్యమును గమనించి సత్యమునే పల్కుటకు న్యాయాన్యాయములు గమనించి న్యాయమే చేయుటకు ప్రయత్నించవలెను

—బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64